# లంకెలబిందెలు

(స్టేజి నాటిక)

రచన:

## కొడాలి గోపాలరావు.

ప్రచురణ:

రవి బుక్ షాపు,

ప్రొప్రైటర్: వేక[illegible]

రైల్వే స్టేషన్ రోడ్, — తెనాలి-2



కాపీరైటు ] 1960 [ రు. 1-50

| | |
|---|---|
| గరుడభేరుండ గంగయ్య | : పంచాయతీ ప్రెసిడెంటు-ధనిక రైతు వయస్సు 40 సంవత్సరాలు |
| ముక్కోణపు ముత్తయ్య | : గ్రామ మునసబు - ధనిక రైతు వయస్సు 40 సంవత్సరాలు |
| పాచికల పాపయ్య | : గ్రామకరణం - వయస్సు 40 సంవత్సరాలు ముత్తయ్య అనుచరుడు |
| దూడబాతుల వెంకడు | : వయస్సు 40 సంవత్సరాలు - గంగయ్య అనుచరుడు |
| కాంతయ్య | : పేదరైతు - 50 సంవత్సరాలు - చదువు సంస్కారం గలవాడు |
| పిచ్చివాడు | : సి. ఐ. డి ఆఫీసర్, కాంతయ్య తమ్ముడు వయస్సు 30సంవత్సరాలు |
| పోలయ్య | : ముత్తయ్య కొడుకు - వయస్సు 20 సంవత్సరాలు, పౌరాణిక నాటకాల పిచ్చివాడు |
| ప్రభాకరం | : గంగయ్య అల్లుడు-ఇల్లరికం వుంటున్నాడు-వయస్సు 20 సంవత్సరాలు |
| కానిస్టేబుల్సు యిద్దరు | : |
| చిరంజీవి | : కాంతయ్య మనుమడు - వయస్సు 10 సంవత్సరాలు |

# నా మాట

మొదట నేనీ నాటకాన్ని నాటిక రూపంలో వ్రాయడం జరిగింది. తరువాత మిత్రులు శ్రీ రంగారావు గారికి వినిపించి, వారి సలహాతో నాటకరూపంలో వ్రాయగలిగాను. ఈ నాటకం తయారైన తరువాత శ్రీ కొడాలి ఆదిశేషయ్యగారికి వినిపించటం జరిగింది. తరువాత వారి అమూల్యమైన సలహాలపై "పిచ్చివాని" పాత్ర ప్రవేశ పెట్టడం జరిగింది. తరువాత ప్రఖ్యాత సినీ నాటక రచయిత శ్రీ నార్లచి రంజీవిగారికి చూపించగా వారు దానిని ఆమూలాగ్రముగా చదివి సన్ని వేశములకు అను గు ణ్య ము గా పా ట లు వ్రా సి ఇ చ్చి న ం దు కు కృతజ్ఞుడను.

ఈ నాటక రచనలో అన్ని విధాలా తోడ్పడిన శ్రీ అభ్యుదయ నాట్యమండలి, (మంగళగిరి) సభ్యులకు నా అభివందనములు. పై సమాజమువారు ఈ నాటకాన్ని తొలి సారిగా ఆంధ్ర కేసరి లలిత కళాపరిషత్తు విశాఖపట్టణము వారిచే నిర్వహించబడిన పోటీలలో పాల్గొని, ఉత్తమ ప్రదర్శనకు, ఉత్తమ రచనకు, దర్శకత్వమున, మేకప్ నకు బహుమతులను పొందిన తరువాత గూడూరు సం స్కృతీ సమ్మేళనమువారు నిర్వహించిన నాటక పోటీలలో పాల్గొని ఉత్తమ ప్రదర్శనకు, ఉత్తమ రచనకు, వుత్తమ

నటనకు, బహుమతులున్నూ మరియు ఒక ప్రయిజున్నూ అందుకొని నాటకలోకంలో యెనలేని గౌరవాన్ని సంపాదించి నందుకు ధన్యుడ్ని.

ఈ నాటకానికి దర్శకత్వమువహించి వుత్తమనటనకు బహుమతి పొందిన శ్రీ ఎ. శివరామరెడ్డి గారు నా నాటకానికి జీవం పోసినందుకు వారికి నా ప్రత్యేకాభివందనములు.

సమాజాల ఆర్థిక పరిస్థితులను బట్టి పాటలు, సంగీతం లేకుండా కూడా ప్రదర్శించుకొనవచ్చు. అవి లేనందు వలన నాటకము ఏ వయస్సు రక్తికట్టదను భయపడ నవసరము లేదు.

ఇట్లు,

విజా "కొండాలి"

ఈ నాటకాన్ని తొలిసారిగా (ముద్రించకపూర్వం) మంగళగిరి శ్రీ విజయలక్ష్మి టాకీస్‌లో 13-11-58 న చేనేత యువజన సదస్సుల సహాయార్థం ప్రదర్శించటమైనది. తరువాత ఆంధ్ర కేసరి లలితకళా పరిషత్తు (విశాఖపట్నం) వారు నిర్వహించిన పోటీలలో 1-1-59 తేదిదీన ప్రదర్శించడమైనది.

నవోదయ ప్రెస్, తెనాలి.

# లంకెలబిందెలు

## రంగస్థలం

### (తెర)

[అది కాంతయ్య పొలం గ్రామానికి అంతదూరమూ కాదు, అంత దగ్గరా కాదు. చేనులో ఒకమూల చిన్నగుట్టపై గుబురుగా పెరిగిన మామిడి చెట్టు, చెట్టుకొమ్మన వేలాడుతున్న పై చెట్టుకానించియున్న, కఱ్ఱ.]
వాత

తెరవిడవగా హరికేన్ లాంపుతో కాంతయ్య ప్రవేశం.

లాంపు క్రమంగా సమీపిస్తున్న కొలది చీకటిలో కూడిన స్టేజి క్రమంగా కాంతివంతమగును కుడివైపు జూస్తూ అలాగే నిలబడతాడు. తర్వాత లాంపు దిబ్బమీద పెట్టి, దుప్పటి కొమ్మమీదుంచి, కఱ్ఱ చెట్టుకానించాడు. సాలోచనగా లాంపు పెద్దది జేసి, చేను కలయజూచి లాంపు తగ్గించి చతికలబడి, చుట్టముట్టించి, ఏదో ఆలోచనలో వుండగా పిచ్చివాడు ప్రవేశించాడు.

పిచ్చి:- నింపాదిగా చెట్టును సమీపించి, జోలె, కఱ్ఱ తీసుకొన్నాడు. కాంతయ్య గమనించాడని. పిచ్చివాడు కొంచెం వేగంగా వెలుపలకు వెళ్తుండగా.

కాం:- [అలికిడివిని] ఎవరది ?

పిచ్చి:- వెళ్తున్నవాడు తిరిగివచ్చి(రహస్యంగా) పోతున్నాగా ! నేవెళ్ళిపోతున్నా ! దిగులుపడతావా ? ఎందుకూ ? నీ చేనూ, నీ చెట్టూ, నీగుట్టూ నీ దంతా నీకే వప్పగించాగా

అంతా నీదేగా! [విచారంగా] అసలు నాదేముంది? ఇందులో నాదేముంది? నిన్ను లక్షాధికార్ని చేసిన దెవరు? [కోపంగా] అప్పుడే మర్చిపోయావా? [నవ్వి] "సంసారం! సాగరం"! అన్నారు.. ఆ మహాసాగరాన్ని ఈదలేనని, నాభూమి పుట్రా అంతా సుకొని, నా సంసారాన్ని నాశనంజేసి, ఈ జోలె, కర్రా నాచేతికిచ్చావుగా! [రెట్టించిన కోపంగా] నా కధికారం రాగానే వాళ్ళందరికి ఉరిశిక్ష వెయ్యనూ? (దిగులుగా) ఏమిటలా జూస్తావ్? నన్ను జూచి అసూయ పడుతున్నావా?. వద్దు! ఈ జోలె నీకొద్దు! దీని నీవు మోయులేవు (విచారంగా) అయ్యో! ఈ జోలె కూడా కాజేస్తావా? (అంటూ పిచ్చివాడు పోతాడు)

కాంతయ్య కన్నీరు తుడుచుకొని కొద్దిక్షణాలు పిచ్చివాడు నిష్క్రమించినవైపు చూస్తుండగా

చిరం:- [వెలుపలనుండి దూరంలో] తాతా! తాతా!! తాతా!!!

కాం:- ఎవరది? బాబూ! బాబూ!

చిరం:-పరిగెత్తుకుంటూ వచ్చి, (తాతా! తాతా! అంటూ తాతను కౌగలించుకొంటాడు చాలా అలసి చెమటపట్టి వుంటాడు) అబ్బా! ఏంచీకటి! దారి కనుపించ లేదు తాతయ్యా! ఒకచోటా...

కాం:-పడ్డావా బాబూ?

చిరం:- లేదు; పడేవాణ్ణే!

కాం:- ఇంత రాత్రి చీకట్లో దేనికొచ్చావు బాబూ?

చిరం:-నాన్న తాగొచ్చి: అమ్మను చావచితకొడుతున్నాడు.

అమ్మ ఏడుస్తూంది, రా, తాతయ్యా పోదాం !

కాం - ఊఁ ...! [నిట్టూర్పు] నీ బాబు మళ్ళీ త్రాగొచ్చాడా?

చిరం:- నిజమే తాతయ్యా ! రెండు కాయల నిండా సారా తెచ్చాడు, ఒక కాయ అంతం పైకెత్తి గటగటా పాన కంలా తాగేశాడు. రెండో కాయ నాకిచ్చి, తాగమన్నాడు. నేను తాగనన్నా అప్పుడు "వెధవ! నువ్వు నా కడుపున చెడపుట్టావ్ రా" అంటూ కర్రతీసుకున్నాడు.

కాం;- కొట్టాడా ?

చిరం:- చిక్కితే కొట్టేవాడే ! నేను చిక్కితానేంటి ?

కాం:- (తనలో తానే నవ్వుకుంటాడు)

చిరం:- మరే తాతయ్యా! నేనువస్తూంటేనూ; ఊరుదాటగానే గంగన్న తుమ్మలచెలువు లేదూ ? అక్కడ...

కాం:- ఊఁ ! అక్కడ ?

చిరం.- రెండు పెద్ద కొరివిదయ్యాలుకట్టమీదకూర్చున్నాయి!

కాం:- కొరివి దయ్యాలా !

చిరం:- ఔను ! కొరివిదయ్యాలే ! అవి యేమిటో నిన్ను గురించే చెప్పుకుంటున్నాయి !

కాం:- దయ్యాలు నన్ను గురించి చెప్పుకుంటున్నాయా ?

చిరం; నిజంగా తాతయ్యా ! అవి యేమి మాట్లాడుకుంటు న్నాయో విందామని నేను కట్టక్రింద దాక్కున్నాను. అప్పుడు అందులో ఒకదయ్యం "కాంతయ్య యిల్లూ వాకిలివదలి, మూడుమాసాలనుండీ; పైరూ పాడూ, లేని ఆ పాడుచేలో రాత్రిపూట పడుకుంటున్నాడంటే, కారణమేమంటావ్ ?" అని అడిగింది రెండోదయ్యం "వాడెందుకు పడుకుంటున్నాడో తెలుసు

కునేందుకు, పెయ్యికళ్లు పెట్టుకొని వెంటాడి కూపీ తీస్తూనే వున్నాను. వాడు కుబేరుడు కావాలని కొంగజపం చేస్తున్నాడు! ఇదిగో ఈ రాత్రితో తేల్చేస్తాన్ వాడి అంతు" అని అంది తాతయ్యా!

కాం;- ఏమిటీ? నిజంగా?

చిరం;- (నవ్వుతూ) దయ్యాలు కాదు తాతయ్యా! మన పల్లపువీధి ముక్కోటూపు ముత్తయ్య, కరణం పాచికల పాపయ్య.

కాం;- అలాగా! [ఇంతలో ఒక నీడవచ్చి మామిడిచెట్టు చాటున నిలబడివుంది. పై సంభాషణ కొంతవరకు విన్నది. కాంతయ్య అలికిడి గ్రహించి నాలుగువైపులా చేను కలియ జూస్తున్నాడు.]

చిరం;- ఏంటి తాతయ్యా అది?

కాంత;- ఏంలేదు బాబూ!

చిరం;- ఆ కొరివిదయ్యాలు వస్తున్నాయా?

కాం;- లేదు లేరా!

చిరం;- తాతయ్యా! అసలు నువ్వు ఇక్కడ ఎందుకు పడుకుంటున్నట్టూ?

కాం;- (కోపంగా) ఎందుకు పడుకుంటే నీకెందుకురా నువ్వు నోరుమూసుకొని వూరొకో?

చిరం;- ఆ. నాకు తెలియదేంటి! అమ్మమ్మ చెప్పిందిలే ఇక్కడ లంకెబిందెలకోసం పడుకుంటున్నావని

కాం;- ఎవరితో చెప్పింది?

చిరం;- ఎవరితో నేమిటి? అమ్మతో, అమ్మ నాన్నతో చెప్పింది, నాన్న తాగొచ్చి వూరంతా చెప్పాడు.

కాం;- ఛీ! ఛీ! పాపిష్టిముండ. నోట్లో ఒక్కమాట కూడా దాగిచావదు కదా!

చిరం;- నీనోట్లో దాగిందేమిటి? నువ్వు చెప్పలా అమ్మమ్మతో!

కాం;- అదీ అయిపోయిందన్నమాట, ఇంతకాలం ఈ రహస్యాన్ని కడుపులో పెట్టుకొని దాచాను. నా చుట్టూ నాగు బాముల్లాంటి మనుష్యులు. రాత్రింబవళ్ళు తిరుగుతున్నారు. కళ్ళల్లో జ్యోతులు పెట్టుకొని కాటిదగ్గర పిశాచంలా ఈ చేను మూడు మాసాలు రక్షించుకొన్నాను, కాని తెల్లవారితే ఊరిజనం పుసిళ్ళ పుట్టలావచ్చి పడతారు! ఆ... రా, బాబూ రా! ఇక ఒక్క క్షణం ఆలస్యంచెయ్యటానికి వీల్లేదు. యింటికి వెళ్ళాలిపద. పలుగు, కావలసిన సామాగ్రి అంతా తీసుకొనివద్దాం.

చిరం;- నేనురాను. వస్తే నాన్న తంతాడు.

కాం;- నేనున్నాగా అసలు ఎవర్ని లేపకుండా దొడ్డి దారిన వెళ్దాము. నువ్వు గోడఎక్కి లోపల గడిశీద్దువుగాని రా.

చిరం;- అమ్మో. నేను దిగనా చీకట్లో, ప్రొద్దున అక్కడ అమ్మకు పాముకనపడ్డది.

కాం;- అబ్బ! నన్ను విసిగించకుండా రా. ముందు.

చిరం;- వస్తానుగాని మరేతాతయ్యా ఆ లంకెల బిందెలు అసలిక్కడకు ఎలావచ్చాయి?

కాం;- ఎందుకురా నీకీ వెధవ ప్రశ్నలు? రా, ముందు. వసపోసిన పిట్టల్లే వాగుతావేరా?

చిరం;- నేను రాను, నా కా కథ చెప్పావేంటి?

కాం; రావూ?

చిరం;- రాను.

కాం:- నా ప్రాణం విసిగిస్తున్నావు కదరా! నీ బాబుపెత్తే హింసలకే తల్లిచస్తున్నా. నువ్వుకూడా నన్నెందుకు ఏడ్పించుకు తింటావురా? రా. యింతకాలమూ యీ చేరెడు నేల పండనీకుండా కాడిగట్టు భూస్వాములు మన కుటుంబాన్ని దరిద్రంతో దిగత్రొక్కారు. ఇంతకాలమూ మనకు తినేరాత లేదు. నువ్వు జాతకుడవురా బాబూ. ఈనాటికి లక్ష్మి అనుగ్రహించింది. నిన్నుగొప్పవాణ్ణిచేయుటానికేరా ఈ నా బాధంతాను

చిరం;- కథ చెప్పమంటే లేదుగాని, గొప్పవాణ్ణి జేస్తాడంట? గొప్పవాణ్ణి? నా కేమీ నద్దులే. [ఒక ప్రక్కకు ముఖము తిప్పి అలిగాడు.

కాం;-వద్దనా్న. ఈ లక్ష్మి నీదేరా. నీకోసమేవచ్చింది [దగ్గరకు తీసి] కథలోయేముంది నామొహం. అంతాఖర్మలోనేవుంది ఇప్పటికి నూరు సంవత్సరాలకు పూర్వం ఇక్కడే మనం నిలబడ్డ చోటనే ధర్మాపురం అనే గామం ఉండేది. ఆ వూళ్ళో చిన్నజమీందారుకోట వుండేది. అదిగో! అ కనబడే నది కావల వైపున సింహాద్రిపురం అనే మరో జమీందారుకోట వుండేది ఈ జమీందారులిద్దరూ ధనవంతులూ, బలవంతులూ. కాని వాళ్ళు ఆజన్మవిరోధులు. వారి శత్రుత్వం, రాను రాను శ్రుతిమించింది ఒకరినొకరు సాధించుకోవాలని, సమయం దొరికితే సర్వనాశనం చేసుకోవాలని ప్రయత్నిస్తూవుండేవాళ్ళు కాని ఈ జమీందారులిద్దరుకూ ఇద్దరు పిల్లలున్నారు. సింహాద్రిపురం జమీందారు కుమార్తె లక్ష్మి అనే అందాలరాశి. ధర్మాపురం జమీందారుకు ఓ చక్కని మన్మథాకారుడైన కొడుకువున్నాడు వీరిద్దరు ఒకరి

నొకరు ప్రేమించుకొని ఒకరినొకరు వదలలేని స్థితికొచ్చారు. ఇద్దరూ యువనవంతులయ్యారు. ఈ రెండు కోటలకు సరి హద్దున యిక్కడకు నాల్గుమైళ్ళలో మల్లేశ్వర దేవాలయం వుంది.

చిరం;- అవును మనవూరి దేవుడు గుడిలాగ.

కాం;- ఆ. ఆ. ఆదేవుణ్ణి ఒక్కొక్క రూ ఒక్కొక్క సంవత్సరం కల్యాణమహోత్సవం చేయిస్తూ వుంటారు. ఒక సంవత్సరం సింహాద్రిపురం వంతువచ్చింది వాళ్ళు యథారీతిని మల్లేశ్వరస్వామి ఉత్సవాలుజరుపుతున్నారు. ఆ సంవత్సరం జమీందారు ముద్దుల కూతురు లక్ష్మిచేత పూజామహోత్సవం ప్రారంభించారు. ధర్మపురం జమీందారు కొడుకు నారాయణ ఆ మహోత్సవం చూడడానికి తల్లిదండ్రులు వద్దంటున్నా అక్కడికి వెళ్ళాడు.

చిరం;- తిరనాల చూడ్డానికా ?

కాంతయ్య:- అవును; లక్ష్మిని నారాయణ నారాయణను లక్ష్మి చూచుకొని ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు. రహస్యంగా వాళ్ళ మనసులో మొలకెత్తిన ప్రేమ కొనలుసారించి చిగురించి మహావృక్షమైనది. నారాయణ లక్ష్మిమీదవున్న ప్రేమను విడిచిపెట్టలేక తల్లిదండ్రులకు తెలియకుండా, సింహాద్రిపురం వెళ్ళి లక్ష్మిని కలుసుకొనేవాడు,

చిరంజీవి:- మరి లక్ష్మి పెళ్ళియింటికి వచ్చేదకాదా ?

కాం;-లేదు. వారి కలయిక కొన్నాళ్ళుసాగింది. ఈ విషయం, ఎలాగో జమీందారు తెలుసుకొని, నారాయణ మరల కోటకు రాగానే పట్టుకొని, చావు దెబ్బలు కొట్టించి.

నదిలో పారవేయించాడు. నారాయణ వెంటవెళ్ళిన మోహన్ అనే కుర్రవాడు చాటునుండి తన మిత్రుడికి వచ్చిన విపత్తుజూచి, దుఃఖించి నారాయణను నదిలోనుండి రక్షించి, యింటికి తీసుకవెళ్ళాడు.

చిరం:- మరి చచ్చిపోలా ?

కాం:- లేదు; లక్ష్మి తన ప్రియుడుకు జరిగిన ఆపదకు కుళ్లి, కుళ్లి యేడ్చింది; నిద్రాహారాలు మానివేసింది. జమీందారు నిర్దాక్షిణ్యంగా కూతురుని దండించి; చుట్టూ మనుష్యులను కాపలా పెట్టించాడు.

చిరం;- నారాయణ యింటికి రాకుండానా ?

కాం:- అవును; నారాయణ మరల ఆరోగ్యవంతుడు కాగానే, ఒకనాడు తన మిత్రునిద్వారా లక్ష్మి వివాహవార్త విని, ఆ రాత్రికి రాత్రి రహస్యంగా, నదిదాటివెళ్ళి లక్ష్మిని కలుసుకోవాలనుకున్నాడు. కాని నది మహావేగంగా పొంగి పొరలుచు ఉండుటనల్ల సాధ్యపడలేదు. ఎలాగో కొయ్య చెక్కలు వేసుకొని నదిదాటి, కోటలో పెళ్లివారి బంధువులా జొరబడి, చివరకు అతికష్టంమీద లక్ష్మిని కలుసుకొని పారిపోదామని చెప్పాడు. లక్ష్మి సరేనంది. ఇద్దరూ మారువేషాలు వేసుకొని ... పారిపోయి వచ్చారు.

చిరం:- ఎవరూ, చూడలేదా తాతయ్యా ?

కాం:-లేదు; ఈ విషయం తెలుసుకున్న జమీందారు, నిప్పులు తొక్కిన కోతిలా ఎగిరిపడి తన శత్రువు తన పుత్రికను తీసికొనిపోవటం, పూర్వవిరోధాలను మనస్సులో పెట్టుకొని, ఎలాగైనా ధర్మపురాన్ని నాశనం చెయ్యాలని, జమీందారుకు ఒక వార్త పంపాడు.

చిరం:- ఏమని!

కాం:- "మనము పూర్వ విరోధులమైనా! మన పిల్లలు, మనల్ని ఆప్తులుగా దగ్గరకు జేర్చారు. ఆడపిల్లను కని ఓడిపోయాను, ఆ పిల్లల పెండ్లి ఏర్పాటుకు వస్తున్నాం" అని, ఆనాడు బాగా బలిసిన కసాయివాళ్ళలాంటి వాళ్ళను రెండువందల మందిని. కత్తులు రహస్యంగా గుప్తపరిపించి, పెండ్లి తాంబూలాలు పుచ్చుకోవటానికి తరలి వచ్చిన వారుగా తీసికొనివచ్చాడు. లక్ష్మి తల్లి రహస్యంగా, రెండు బిందెలునిండా ధనం, నగలు, నాణ్యాలు పోసి మిఠాయి కావిళ్ళలా నమ్మకమైన వాళ్ళద్వారా పంపింది!

చిరం:- మరి వాళ్ళమ్మ రాలేదా?

కాం:- జమీందారే రానివ్వలేదు. యథార్థానికి జరుగవలసిన వన్నీ జరిగాక, అంతా నిద్రించేవేళ జమీందారు రౌడీలు కోటలో జొరబడి అందర్నీ నరికివేశారు. కాని జమీందారుల మనస్పర్థలు కారణంగా ఇరుపక్షాలకి కొట్లాట ప్రారంభమైనది కొందరికి తలలు, కొందరికి చేతులు కొందరికి కాళ్లు తెగిపడ్డాయి. రౌడీలు కోటనంతా కాల్చి భస్మంచేశారు. ఆ మారణహోమంలో లక్ష్మి, నారాయణులు చనిపోయారు. మిగిలినవాళ్లు పారిపోయారు. ఆనాడు ధర్మాపురం నామరూపాలు లేకుండా నాశనం అయిపోయింది.

చిరం:- మరి! ఆ బిందెలేమైనాయి తాతయ్యా?

కాం:- లక్ష్మి కొజను తల్లి పంపించిన బంగారు బిందెలు, యేమైనవో ఎవరి కంటా పడలేదు. నేను మూడుమాసాల క్రితం యిక్కడ మంచినీటిబావి తీద్దామని తవ్వుతుంటే

అవి కన్పించాయి. ఆ గోతిలోనే ఓ బంగారులక్ష్మి విగ్రహం దొరికింది. దానిని ప్రభుత్వమువారుతీసికొనిపోయారు. అప్పటినుండి నేను లక్ష్మిపూజ ప్రారంభించాను. అ ! రాబాబూ ఇంటికి పోయి, కావలసిన పరికరాలు తీసుకొద్దాం. ఆలస్యమైతే మన అదృష్టరేఖ మారిపోతుంది. నీకు ఈ పెద్ద విషయాలు తెలియవురా !

చిరం:- తెలియకపోవడమేంటి తాతయ్యా, నువ్వుచూశావని అమ్మమ్మతో చెప్పావటగా !

కాం:- అవును, నాయనా! ఈ రాత్రికి రాత్రే మన పనంతా పూర్తికావాలిరా !

[కాంతయ్య చిరంజీవులు నిష్క్రమిస్తారు]

ము త్త:- [చెట్టుచాటునవుండి. కాంతయ్య రహస్యాలన్నీ విన్న ముక్కోణపు ముత్తయ్య నవ్వుతూ ప్రవేశం] ఓరీ; తెలివితక్కువ దద్దమ్మా ! ఈ ముక్కోణపు ముత్తయ్యను మోసగించగలవాడు, ఈ ముల్లోకాల్లోనూ లేడనే సంగతి తెలియదట్రా ! (మీసం మీద చెయ్యివేశాడు.)

పాప;- [వడి, వడిగా పరిగెత్తుకుంటూవచ్చి] నాకు తెలియకడుగుతాను! ఏమైనా అంతు పట్టిందా అని.

ము త్త;- అంతుపట్టడమేంటి! ఆయువుపట్టె తెలుసుకున్నాను అమ్మి, దేవాంతకుడండీ !

పాప:- దేవాంతకుడేమిటండీ ! నాకు తెలియకడుగుతాను, నరాంతకుడు కాదుటండీ !

ము త్త:- చాల్లేవయ్యా!నీకసలు ఆశ లెక్కువ, ఆలోచన తక్కువని పెళ్ళాంమీదలిగి పొలంమీద పడుకుంటున్నాడని చెప్పావు కదూ !

పాప;- నాకు తెలియకడుగుతాను; అల్లుడుమీదలిగి, ఇక్కడ పడుకుంటున్నాడని మీరు మాత్రం చెప్పలా !

[ఇంతలో చెట్టుచాటున గంగయ్యవచ్చి నిలబడుతాడు]

ము త్త;- చెప్పానయా ! ఈ బందిపోటు వెధవ లంకెల బిందెల కోసం రాత్రిపూట బ్రహ్మరక్షసిలా కావలా కాస్తున్నా డని నాకు మాత్రం ఏం తెలుసయ్యా?

పాప;- ఏమన్నారు! ఏమన్నారు! నాకు తెలియకడుగుతాను; ఏమన్నారు? లంకెల బిందెలే!

ము త్త;- అరె! నా తెలివి తెల్లారా, నే చెప్పకూడదనుకుం టూనే చెప్పేసేనే.

పాప; నాకు తెలియకడుగుతాను చెప్తే మీ కొచ్చిన నష్ట మేమిటండీ.

ము త్త;- విషయం తెలిస్తే ! పిశాచంలా వెంటపడి పీక్క తిన వటయ్యా.

పాప;- నాకు తెలియకడుగుతాను ! డబ్బు అంటే ఆశ లేని వాడెవడండీ ?

ము త్త:- అవునయ్యా ! వుంటుంది; నాకూ వుంటుంది కుబే రుణ్ణి కావాలని. కాని దానికి యోగ్యత కావొద్దుటయ్యా యోగ్యత ?

పాప;- నాకు తెలియకడుగుతాను, కాంతయ్యకు ఏదో కలసి వస్తుంటే దాన్ని కాజేయాలని తాపత్రయ పడటానికి మీకుమాత్రం ఏంయోగ్యత వుందని చెప్పండి!

ము త్త;- తాపత్ర్యంలేని జన్మ దేనికయ్యా తగలెట్టనా అయినా భూమిలో దొరికే నిక్షేపం వాడి బాబు సొమ్ములా మాట్లాడతావేంటి ?

పాప;- నాకు తెలియకదుగుతాను, భూమిలో దొరికే నిక్షేపం [లంకెలబిందెల మోతలు వినిపిస్తాయి. పాపయ్య,ముత్తయ్య యిద్దరూ వింటారు. పాపయ్య ఆనందావేశంతో] ఈ పాచికల పాపయ్యకు తెలియకుండా కాకిలా తన్నుకు పోవాలను కుంటున్నారేమొ, చెపుతున్నా! ఈ కరణాన్ని కాదంటే కానీకూడా మీ చేతికి దక్కదు మీరు భాగం పెట్టనంటే యిప్పుడే వెళ్ళి గార్నమెంటుకు రిపోర్టుయిస్తా. [అంటూ వెళ్లిపోతాడు]

ముత్త:- ఆదేనయ్యా, మీదగ్గరున్న రోగం. దూడని కుడవ నివ్వరు; దుత్తని పడానివ్వరు. ఇదిగో,పాపయ్యా, నీకు ఎన్ని సార్లు ధాన్యం. మినుములు. కందులు, ఉచితంగా యిచ్చా నయ్యా. అంతకృతజ్ఞతలేకుండా మాట్లాడుతావేమయ్యా?

పాప;- ఇచ్చారుట, ఇచ్చారు, నాకు తెలియ కదుగుతాను ఆస్తికోసం మీ పినతల్లిగార్ని మీరు చంపించి నపుడు, వారసులకు దక్కకుండా వంద ఎకరాల భూమికి, దొంగ వీలునామా పుట్టించి, మీ పరం చేశానే; మీరాపా టయినా కృతజ్ఞత ఉంచుకున్నారా! చెప్పండి.

ముత్త;- చేశావయ్యా! చెయ్యలేదన్నానా? నీ నోట్లో నువ్వుగింజపడితే పేలగింజలా పేలి పదిమందికీ తెలుస్తుం దనిగాని లేకపోతే నీకుచెప్పకుండా వుండేవాడినా?

పాప:- నాకు తెలియకదుగుతాను! మనిషన్నవాడికి ఏదో ఒకలోపం ఉండకుండా వుంటుందా?

ముత్త:- సరేలేవయ్యా! ఆగండభేరుండ గంగయ్యకు తెలియక ముందే త్వరగావెళ్ళి ఈ భూమిని ఎంతయినాసరే కొని... మన పేరపెట్టుకోవాలి...నువ్వు ఎలావేస్తావో పాచిక!

ఆ కాంతయ్యకు మళ్ళీ పుట్టగతిలేకుండా మన చేతిలో పిట్టలా చిక్కుకు పోవాలి.

పాప:- నాకు తెలియకడుగుతాను; ఈ పాచికల పాపయ్య పాచిక వేశాడంటే పరమాత్ముడుకూడా తప్పించుకోలేడు. గుడ్డిగవ్వ ఖరీదు చేయని గంగయ్యను గురించి గునుస్తా రేమిటండీ.

ము_త్తే:- "చిన్న పాముసైనా పెద్దకర్రతో కొట్ట" మన్నారు. కంటిలో నలుసులా - కానిదానికి - అయినదానికి తగుదు నంటూ ఈ గంగయ్య ఒకడు ప్రతిదానికి అడ్డమొస్తు న్నాడు. మొన్నచూచారుగా ఆ మాదిగ సుబ్బడు యుద్ధం లోకి వెళ్ళి 8 సంవత్సరాలుండి, యింగ్లీషువాడి అభిమానం సంపాదించుకొని ఊరుప్రక్కన బంజరు పడెకరాలు నానాబాధలుపడి దానిని ఫలసాయానికి తీసుకొనివస్తే ఈ గంగయ్య రాజకీయ బాధితుణ్ణని గద్దలాగా తన్నుకు పోయాడు.

పాప:- అంతేనా! మిమ్మిష్టర్ని అంటకాగి, నాకు తెలియకడు గుతాను; ముందుగా మీరు పెట్టిన పిటీషన్ను కొట్టి వేయించి - అదృష్టజాతకుడు కాబట్టి అనుభవిస్తున్నాడు.

ము_త్తే:- అనుభవిస్తాడయ్యా! అనుభవిస్తాడు. ఊరూ పేరూ లేనివాణ్ణి తీసుకొచ్చి - అడ్డమైనవాళ్ళ కాళ్లు పట్టుకొని సాటి కులస్తుడని ఓట్లువేయిస్తే, మన నోట్లోనే దుమ్ము కొట్టాడాయె.

పాప:- ఆ ...! మీకుమాత్రం తక్కువ జేసిందేముంది. బం గారంలాంటి బస్సుపరిమిట్లు రెండుమీకూ యిప్పించాడుగా

ము_త్తే:- ఆ ...! ఇప్పించాడులేవయ్యా, వాళ్ళు వచ్చినప్పు

డల్లా విందులకు, సన్మానాలకు, 20 వేలు తగలేశాను.

పాప:- నాకు తెలియకడుగుతాను! ఆ మాటకొ స్తే గంగయ్య గారు మాత్రం ఖర్చుపెట్టనిదెప్పుడు చెప్పండి? పోయిన ఎలక్షన్లలో అలగాజనం ఓట్లన్నీ డబ్బిచ్చి కొనివేయించింది ఆయనేగా?

ముత్త:- చాల్లే వూరుకోవయ్యా! ఆయన సొంత సొమ్ముచ్చాచ్చేడేమిటి? పార్టీపేరుచెప్పి పదిమంది దగ్గరా వసూలు చేసి యిచ్చాడు. చందా పేరుతో నా దగ్గరా తీసుకొన్నాడు వెయ్యిరూపాయలు.

పాప:- నాకు తెలియకడుగుతాను! మీరు మాత్రం సొంత సొమ్ము ఖర్చుపెట్టారేమిటి? ఆనాయుళ్ళూ; రెడ్లదొమ్మీలో రెడ్లను నాయుళ్ళు చంపినపుడు ఆ హత్యానేరాన్ని కొట్టివేయించినందుకు, ఆ నాయుళ్ళు యిచ్చిన 20 వేలతోనేగా మీరు సత్కారాలు. సన్మానాలు చేసింది.

ముత్త:- [చిరునవ్వుతో] లేకపోతే. ఎవడిచావుకో - సన్మానానికో, మన డబ్బు ఖర్చు పెట్టటమేమిటయ్యా? పదవులు. పార్టీలు అంటే - వసులది కానీ పుచ్చుకోటానికేగాని, యిచ్చుకోటానికిగాదు. ఆ ...! పద, పద. ఆ గంగయ్యకు తెలిసిందంటే గొంతుమీదకు తీసుకొస్తాడు

పిచ్చి:- [రివ్వురివ్వునావచ్చి] చెయ్యండి, తంత్రాంగం! చెయ్యండి. మంత్రాంగాలు, చేసిచేసి నా కాపరం నట్టేట కలుపండి? నాకు తెలుసు నా కాపరం నట్టేట కలుస్తుందని. (నవ్వి) మంచిపనే జరిగింది. చూచారూ. కొండంత సంసారం లాక్కొని ఈ జోలె కట్రంబిచ్చారు. [కోపంగా] దానితిక్క వదిలిందిలే? (ఏడుస్తూ) నా జోలె కర్రా.

లాక్కుంటారా?

ము_త్త:- పిచ్చి ముండాకొడుకు, యిప్పుడు తద్దినమయ్యాడేం;

పాప:- నాకు తెలియకడుగుతాను, వాడిగోల మనకు తెలుసా? మన గోల వాడికి తెలియడానికి?

పిచ్చి:- బలే చెప్పావ్, నా గోల మీకు, మీ గోల నాకూ తెలియకపోవడమే మంచిది, తెలిస్తే నేను మీ కంటే గొప్పవాణ్ణయిపోనూ, (నవ్వి) నా జోలె కావాలంటారా? తీసుకోండి, ఎప్పుడైనా మీ కొచ్చేదే అది. [ఏడ్చి] నన్ను పిచ్చివాడంటారూ, అనండి నేనే కాదు; నా బాబు పిచ్చివాడు, నా తాత. ముత్తాతలూ, అందరూ పిచ్చివాళ్ళే. ఓరి పిచ్చివాగన్నల్లారా?... ఒకరికి డబ్బుపిచ్చి, మరొకడికి పెళ్ళాంపిచ్చి, ఇంకొకరికి కీర్తిపిచ్చి, ప్రతివాడికీ ఏదోపిచ్చి. ఈ లోకానికి ఓ! పెద్దపిచ్చి. ఏ పిచ్చీ లేకపోతే యీ అర్ధరాత్రి ఈ రహస్య తంత్రాంగానేమిటి? [నవ్వాడు]

పాప:- నాకు తెలియకడుగుతాను, రండి పోదాం. యింకా దేనికిక్కడ?

పిచ్చి:- వద్దు వద్దు, యిక్కడ నా జోలె [రహస్యంగా చెప్పినట్లు మెల్లగా] జోలెలో.. జోలెడు డబ్బు... బంగారం... పొలం... అన్నీ వున్నాయి. కావాలా? తీసుకోండి అర్ధరాత్రి వచ్చి అవస్థలు పడుతున్నారు, పాపం. (పిచ్చిగా, కోపంగా) ఎవర్రా మీరు? యీ పొలం, యీ చెట్టుక్రింద నున్న గుట్టు తెలుసుకోవటానికి వచ్చారూ? వెళ్ళండి? మీ ప్రాణం తీస్తా? నా కధికారం వస్తే - (నవ్వి) భయపడకండి? మిమ్మల్ని రాజుల్ని చేస్తాలే? (చెవిలో చెప్పినట్లు) మీకు తెలుసా? యిక్కడ యిక్కడే, [నవ్వి] ఓ పెద్ద

రహస్యంవుంది, చెప్పనా ? .... వింటారా ? నా దగ్గరకు రండి; దూరంగావుంటే, గోడలకు చెవులుంటయ్యాయ్, ఏమిటలా పైకివస్తారూ! ... [నవ్వి] రహస్యం వింటానికా, వద్దు, వద్దు. ఈ గోతిలోదిగితే గోచిపాతరాయుళ్లై పోతారు, అర్థం బలిగోరుతుంది ! ... అన్యాయంగా చస్తారు. ఎందుకు మీకీ వ్యర్థ ప్రయత్నం. వెళ్ళండి ... [గట్టిగా] వెళ్ళండీ ? [దగ్గరకు వచ్చి] వెళ్ళిపోతున్నారేం ? ... రహస్యం వినరూ ?

పాప:- వింటాం చెప్పూ ?

పిచ్చి:- చెప్పాలీ ! ... ? యిప్పుడు గాదులే. మళ్ళీ వచ్చి నప్పుడు చెప్తాలే తొందరపడకండీ ! ... ? వండ లేదుగా, వండ లేదుగా ! [అంటూ వెళ్ళిపోతాడు]

ముత్త:- అర్థమయింది ? వీడుకూడా యీ లంకెల బిందెల కోసం పిచ్చివాడైయుంటాడు !

పాప;- నాకు తెలియకడుగుతాను, అసలు యింతకూ ఇక్కడ లంకెల బిందెలున్నాయుంటారా ? [లోపల నుంచి లంకెల బిందెల మోతలు వినపడతాయి]

ప్రతాపం, ఆ కాంతయ్యను కాళ్ళుకట్టి. మీ కాళ్ళ ముందువడేసి ఈచేను నీదనిపిస్తాను [ఇద్దరూ వెళ్ళిపోయారు]

గంగ:- [చెట్టుచాటు నుండి గర్వంగా నవ్వుతూ వస్తాడు] ఓరి వెధవల్లారా, యీ గండభేరుండ గంగయ్యను కాదని గాజు ముక్క కూడా తీసుకెళ్ళలేరు.

వెం:-[వెనుకనే వడివడిగా ప్రవేశించి] ఏందిదొరా! నా సామి రంగ. ఆళ్ళకి పట్టపగ్గాలు లేకుండా వున్నయ్యే !

గంగ;- ఉంటాయిరా, ఉంటయ్, ఎన్నడూ ఎర్రని యేగాని చూడని వెధవలకు నిధులు, నిక్షేపాలు కలసి రాబో తూంటే భూమ్మీద కాళ్ళానతయ్యా ?

వెం:- నా సామిరంగా ! నిచ్చేపమే, అముత్తయ్య కొత్తే యిక నీల్గి చచ్చారనుకోండి జనం.

గంగ:- ఓరి వెధవా హు ...! కాస్త తలెత్తేసరికి కాలికొద్దీ తన్నుకు పోవటానికి, యీ గండభేరుండ గంగయ్య లేడురా!

వెం:- నా సామిరంగా, వాసనొత్తే యేసుకుపోవటానికి యీ దూడబాతుల యెంకడుండగా. మీకెందుకుండి ఆ కరన పాయన, పల్లపీదాయిన పంచుకోవాలని చూత్తున్నారు దొరా మీరు ఊ ... అనుండి నా సామిరంగా ఒక దెబ్బ తీసుకుంటా.

గంగ:-అఘోరించావ్ లేరా ? సారాతాగి ఆ సుబ్బాం వాకిట్లో పడుకోటం గాదు, ఇది బుఱ్ఱతో కూడుకున్న పనిరా !

వెం:-(తన్మయత్వంలో) ఆగండి దొరా ! ఆగండి ! నా సామి రంగా సల్లనేల ఆ ముండని తల్చినారు. కమ్మని సారా తాగిట్లో సుబ్బాంవుంటే యింకా పెపెంచకం ఎందుకు దొరా !

రహస్యంవుంది, చెప్పనా? ... వింటారా? నా దగ్గరకు రండి; దూరంగావుంటే, గోడలకు చెవులుంటయ్యాయ్, ఏమిటలా పైకివస్తారూ! ... [నవ్వి] రహస్యం వింటానికా, వద్దు, వద్దు. ఈ గోతిలోదిగితే గోచిపాతరాయుళ్లై పోతారు, అర్థం బలిగోరుతుంది! ... అన్యాయంగా చస్తారు. ఎందుకు మీకీ వ్యర్థ ప్రయత్నం. వెళ్ళండి ... [గట్టిగా] వెళ్ళండీ? [దగ్గరకు వచ్చి] వెళ్ళిపోతున్నారే? ... రహస్యం వినరూ?

పాప:- వింటాం చెప్పూ?

పిచ్చి:- చెప్పాలీ! ...? యిప్పుడు గాదులే. మళ్ళీ వచ్చి నప్పుడు చెప్తాలే తొందరపడకండీ! ...? పండలేదుగా, పండలేదుగా! [అంటూ వెళ్ళిపోతాడు]

ముత్త:- అర్థమయింది? వీడుకూడా యీ లంకెల బిందెల కోసం పిచ్చివాడైయుంటాడు!

పాప:- నాకు తెలియకడుగుతాను, అసలు యింతకూ ఇక్కడ లంకెల బిందెలున్నాయుంటారా? [లోపల నుంచి లంకెల బిందెల మోతలు వినపడతాయి]

ముత్త:- "శుభం పలకరా" మంకా అంటే! "పెళ్లికూతురు ముండా" అన్నాడంట. ఇప్పటికి 20 సంవత్సరాలకు పూర్వం యిక్కడ ధర్మాపురం చిదస్తయిన విషయం విన లేదటయ్యా నీవు?

పాప:- నాకు తెలియకడుగుతాను! అదా కథా! అయితే యిక పదండి, ఏమండోయ్ అర్థభాగంమాట మర్చిపోవద్దు.

ముత్త:- [చిరునవ్వునవ్వి పాపయ్య భుజంమీద తట్టాడు]

పాప:- ఇకిప్పుడు చూడండి; ఈ కరణం పాచికల పాపయ్య

ప్రతాపం, ఆ కాంతయ్యను కాళ్ళుకట్టి. మీా కాళ్ళ
ముందుపడేసి ఈచేను నీదనిపిస్తాను [ఇద్దరూ వెళ్ళిపోయారు]

గంగ:- [చెట్టుచాటు నుండి గర్వంగా నవ్వుతూ వస్తాడు] ఓరి
వెధవల్లారా, యీ గండభేరుండ గంగయ్యను కాదని గాజు
ముక్కకూడా తీసుకెళ్ళలేరు.

వెం:-[వెనకనే వడివడిగా ప్రవేశించి] ఏందిదొరా! నా సామి
రంగ, ఆళ్ళకి పట్టపగ్గాలు లేకుండా వున్నయ్యే!

గంగ;- ఉంటాయిరా, ఉంటయ్, ఎన్నడూ ఎర్రని యేగాని
చూడని వెధవలకు నిధులు, నిక్షేపాలు కలసి రాబో
తూంటే భూమ్మీద కాళ్ళానతయ్యా?

వెం:- నా సామిరంగా! నిచ్చేపమే, అముత్తయ్య కొత్తే యిక
నీల్గి చచ్చారనుకోండి జనం.

గంగ:- ఓరి వెధవా హు ...! కాస్త తలెత్తేసరికి కాలికొద్ది
తన్నుకు పోవటానికి, యీ గండభేరుండ గంగయ్య లేదురా!

వెం:- నా సామిరంగా, వాసనొత్తే యేసుకుపోవటానికి యీ
దూడబాతుల యెంకడుండగా. మీకెందుకుండి ఆ కరన
పాయన, పల్లపీదాయిన పంచుకోవాలని చూత్తున్నారు
దొరా మీరు ఊ ... అనుండి నా సామిరంగా ఒక దెబ్బ
తీసుకుంటా.

గంగ:-అఘోరించావ్ లేరా? సారాతాగి ఆ సుబ్బాం వాకిట్లో
పడుకోటం గాదు, ఇది బుఱ్ఱతో కూడుకున్న పనిరా!

వెం:-(తన్మయత్వంలో) ఆగండి దొరా! ఆగండి! నా సామి
రంగా సల్లనేల ఆ ముండని తల్చినారు. కమ్మని సారా
కాగిట్లో సుబ్బాంవుంటే యింకా పెపెంచకం ఎందుకు
దొరా!

గం:-అదుగో, ఆ తన్మయత్వమే పనికిరాదురా. మొన్న అట్లా చేసికాదు; గవర్నమెంటు పోరంబోకుల్లో తుమ్మలన్నీ కొట్టిరండిరా అని అర్ధరాత్రి పంపితే; ఆ పాడుముంగ కొంపలోదూరి పనంతా పాడుచేస్తివి. ఎలా వాసనపట్టాడో ఆ ముత్తయ్య ఓవర్‌సీర్‌ను, మైలుజవానుల్ని పంపి మన ప్లానంతా పాడుచేసాడు ఆ తుమ్మలన్నీ పెడితే రెండు ఇటుకరాతి ఆములు కాలేవికదా, అందినమటుకు దూడబా తల్లే తినడానికి పనికివస్తావుగాని, కానీపని నీవల్ల తేలిచస్తుం దట్రా ? ఎప్పుడూ సుబ్బామో, సుబ్బామో అని యేడుస్తా వేరా ? ఒరేయ్, ఇవన్నీ దరిద్రానికి హేతువులురా ?

వెం:- ఈ మాటల కేం దొరా ? నా సామిరంగా ఆడదంటే గాడిదకాని మొగోణ్ణి చూపిచ్చండి ... దొరా ! మీరు మటుకు మీరు ఆ నరసమ్మ గోరింటో దూరితే నాలుగు రోజులుకు కూడా బయటికి రారుగందా నన్నంటారేంది.

గం:- ఒరేయ్ నీకూ-నాకూ పొత్తంట్రా, దానికి మగదిక్కు లేదు. దాని మంచిచెడ్డలు చూడవలసిన బాధ్యత నా మీ దుంది.

వెం:- అందుకేగా నా సామిరంగ, మరుదుల్ని మోసగించి, లచ్చరూపాయలాత్తి తెచ్చిపడేసింది.

గం:- :- [తనయత్వంలో] ఆహాం ...! ఆడదంటే దాన్నే చెప్పాలిరా, నిజమైన ఆడది, నిఖార్సయిన ఆడది. హుం నా పెళ్ళాం వుంది దేనికి ? దాన్ని తగలెయ్య. తండ్రి పెళ్లినా డిస్తానన్న కట్నండబ్బు కానీ తేవడానికి చేతగాలేదు.

వెంక:- అదేందండీ నా సామిరంగ మొన్న మీటింగులో ఎక్కి- మీరు కట్నాలు తీసుకోగూడదు, ఎదవముండలకు

పెళ్లిళ్లు చెయ్యాలన్నారుగా దొరా!

గం:- ఒరేయ్ చెప్పినవన్నీ చేస్తూకూర్చుంటే చిప్పచేతికొస్తుం దిరా సన్యాసి.

వెం:-నా సామిరంగా మీకెన్నైనా చెప్పండి దొరా! ఆ అన్న పూర్ణమ్మగోరు అన్నపూర్ణమ్మ గోరేనండి, మీరు ఆమెను అన్యాయం చేయ:కూగాని.

గం:- నోర్మూయ్ వెధవ. ఆ పిచ్చిముండ వండిపడేస్తే దూడ బాతులల్లే కొంపమీదపడి తిని దాన్ని తెగపొగడక ఏం చేస్తార్రా మీరు, యిదుగో చూడు; మనం ఈ కాంత య్యను ఎలాగైనా వశంచేసుగోవాలి.

వెం:- అసలింతకూ, నాసామిరంగా యీ చేలో లేకెలవింకె లున్నయ్యని కాంతయ్యగోరి అల్లుడు సెప్పిన మాట కాయమే నంటారా?

గం:- ఖాయం కాకపోతే ఆ కాంతయ్య గోతికాడ నక్కల్లే మూడు మాసాలనుండి దేనికి కావలికాస్తాడురా?

వెం:- [ధనపు బిందెలు మోతలు లోపలనుంచి వినిపిస్తాయి. ఇద్దరూ వింటారు. వెంకడు హుషారుగా] నా సామిరంగా ఇకెత్తేయండి. నాయాల్లు చిత్తైపోవాల. ఎన్ని వేలయినా పెట్టి, ముందీచేను ముత్తయ్య కొనకముందే కొనేశాయండి

గం:- కొనక వూరుకుంటానురా! అవసరమైతే వెయ్యిమీద వెయ్యిపెట్టైనాసరే ఈభూమి కొంటాగాని వదలిపెడతానా?

వెం:- నాసామిరంగా అదృష్టం కలిసొత్తే ఈ యదవ ముకాన కూడా కాత్తపారేయండి దొరా!

గం:-అయిందీ దీనెమ్మకడుపుకాల ఈ డబ్బు చూస్తే మనిషికి, చీమూ, నెత్తురు చచ్చిపోతుంది. ఛీ.. ఛీ ఇదంతా నా

కోసమట్రా? నేను కట్టుకు పోవడానికా? అసలు మీారు లేకుండా నేనెక్కడున్నానురా?

వెంక;- ఆఁ ! ఈ మాటలకేం లెండి. పోయిన ఎలక్షన్లో మినిష్టరాయనకు ఓట్లేత్తే పల్లెలో చర్చికట్టిత్తా మన్నారు. కట్టిచ్చారా సెప్పండి? మొన్న-నా పెల్లాం నీల్లాడింది— మూాడురూపాయిలు. ముట్టి మూాడు రూపాయులిమ్మంటే- వందరూపాయి లుంచుకోని కాసీలేదని కండితంగా సెప్పారు

గం:- ఒరేయ్! ఆ డబ్బు నాదట్రా? ప్రజలసొమ్ము పెళ్ళాం పురుడి కివ్వలేనంటావే? ఇంకా పరువేటున్నా వుండాలా- అక్కర్లేదా?

వెం:- ఒసబ్బో! పరువుకోసం నూసేవాల్లయితే పెజల సొమ్ముతో కూతురుపెల్లి ఎట్లా సేశారు సెప్పండి?

గం:-ప్రజలసొమ్మే నా సొమ్ము; నా సొమ్మే ప్రజల సొమ్ము. ఏది నాదో ఏదికాదో ఎట్టా తెలుస్తుంది? అంతా కలిసున్న తరువాత! ప్రజలసొమ్మని ప్రత్యేకంగా ఎట్లా తెలుస్తుం దోయ్? (గంగయ్య జేబులోంచి నాలుగు పుగాకు కాడలు తీస్తాడు. ఒకపాయ చుట్ట చుట్టుకోబోతాడు. వెంకడు అదిజూచి]

వెం:-అంతేలెండి నా సామిరంగా, యాడదండి? మా కమ్మని పుగాకు కాలుత్తుండారే! ఒకకాడ యీా యదవముకాన పారేయండి.

గంగ:-ఇంకానయం నావంద ఎకరాలు వ్రాసిమ్మన్నావుకావు. నాకుండే నాలుగుకాడలు ఆఁ -! నీవుపెల్లి మా యష్టసారిటావున్న గుల్లపుగాకులోంచి గుప్పెడు తెచ్చుకో, వస్తూ, వస్తూ, ఆ కాంతయ్య, పావయ్య, ముత్తయ్యవాళ్ళు

ఎక్కడున్నారో ఏం చేస్తున్నారో చూసిరా?

వెం:- యీ పన్లు కేంలెండి, పుగాకు కాడ దగ్గరే యింతపట్టు పడుతున్నారే యింకా ఆ లంకెల బిందెలొస్తే నా కేం భాగం పెడతారు, సెప్పండి నా సామిరంగా ఆ సుబ్బాం దగ్గిరకన్నా ఎల్లి చుట్ట పుగాక్కి సంపాయిత్తా (యిరుసుగా వెళ్ళ బోతాడు)

గంగ:- (పోతున్న వాడికి వెంటనే) ఇదిగో చావు! (ఒక కాడ యిస్తాడు) పను లొచ్చినప్పుడేరా, వెధవ ఏడుపులు. వెళ్ళు, వెళ్ళి వాళ్ళ విషయం కనుక్కురా?

వెం;- [పుగాకు వాసన జూస్తూ] నా సామిరంగ లంకెల బిందె లొత్తే భాగం పెట్టాల మరి?

గంగ;- పెడతారా, పెట్టక నే నొక్కణ్ణే కట్టుకు పోతానా! వెళ్ళుముందు?

వెం:-ఆ మాటన్నారు, నాసామిరంగ యిక నూసుకోండి యీ దూడబాతుల వెంకడి పని [వెళ్ళాడు]

గంగ:- [దూరాన్నుండి పాట వినిపిస్తుంది. పాట వింటూ చుట్ట చుట్టి వెలిగిస్తాడు. పాట అయిపోగానే సగర్వంగా నవ్వుతాడు]

పాట॥ దురాశ కడు; దుర్మార్గంరా
అతిదురాశ పెనుపాపంరా
నరుడా నరుడా వానరుడా!

పరులకొంప కూల్చాలని చూడకు
ఒరుల దీపమార్పాలని ఎంచకు
కాలం కర్మం నీకుమూడితే
కాలసర్పమై నిన్నే కఱచును

దురాశ కడుదుర్మార్గంరా.
కోటికి పడగెత్తాలని తలచీ
కూటికిలేనీ పేదలదోచీ
మేడలు కట్టాలని చూస్తారూ
ఓడలు నడపాలని చూస్తారూ
దురాశ కడుదుర్మార్గంరా.
పరాయిసొమ్ము పటికీబెల్లం
కిరాయిబ్రతుకే గుట్టుపుదానా
పరులనుదోచే క్రూరమృగాలకు
జరిగితీరురా ప్రాయశ్చిత్తం
దురాశ కడు దుర్మార్గంరా.

[ఒక్క నిమిషం తరువాత కాంతయ్య పలుగు పారా, కొబ్బరికాయ. వెంట ఒక మేక, హారికేన్ లాంపుతో మెల్లగా ప్రవేశిస్తాడు. కాంతయ్యను జూచి గంగయ్య ప్రక్క చీకట్లో దాక్కుంటాడు. కాంతయ్య మేకను అవతల స్టేజీలో కట్టివేసి లాంపుతో ఒకసారి నలువైపులా చూచాడు. ఒక వైపున చీకట్లో గంగయ్యను జూచి, ఆశ్చర్యము, భయంతో, రెండడుగులు వేసి]

కాం:- [గాబరాగా] ఎవరూ ?

గం:- నేనే !

కాం:- [ఆశ్చర్యముతో లైటు పెద్దది జేశాడు]

గం:- [నవ్వుతూ] నేనే గంగయ్యను గుర్తించలా ?

కాం:- ఏమిటి ? ఇలావచ్చారు.

గం:-ఆ...! ఏమీలేదు. మా పాడిగేదె పలుపు తెంచుకొని పొలంమీద పడింది. యిటువైపు వచ్చిందేమోనని

వచ్చాను. రామ! రామ! ఈ పాలేళ్ళతో బాధపడలేక చస్తున్నానయ్యా. గొడ్లను గట్టిగా కట్టివేయటానికి ఓపిక వుండదుగాని ప్రొద్దుగూకముందే పెళ్ళాందగ్గరకు పరుగెత్త డానికి ఎక్కడలేని ఓపిక వస్తుందండి వెధవలకు.

కాం:- [పలకడు]

గంగ:- మీ కేమైనా కనిపించిందా?

కాం:- లేదు కనిపించ లేదు.

గంగ:- (వ్యంగ్యంగా) అవున్లే నీకు భూమిమీద తిరిగేవి ఎలా కనిపిస్తాయి. ఆ...! యేమిటి? పారా పలుగు తీసుకొచ్చావు?

కాం:- ఏదో మురకా వల్లాలు సరిచేద్దామని.

గంగ:- రాత్రిపూట పనేమిటయ్యా?

కాం:- పగలు ఎండలో పని చేయ లేక.

గంగ:- అది సరేగాని, కాంతయ్యా ఎప్పుడూ లేనిది ఈ మేకపోతు నొకదాన్ని తగిలించుకున్నా వెందుకు?

కాం:- ఆ...! మేకుంది యీవాళ్ళకు పెడదామని మొన్ననే కొన్నాను.

గంగ:- [వ్యంగ్యంగా] అవున్లే, ఈ మధ్య నీకు పూజలూ పునస్కారాలు ఎక్కువైనాయి. అది సరేగాని కాంతయ్యా నీకు చేనికయ్యా, ఈ పాడు బెడసంతాను, 50 ఏళ్ళు నెత్తిమీదకొచ్చాయి. యేదో కృష్ణా, రామా అంటూ కూర్చొని తినవలసిన తరుణంలో, గుండెలు పగిలేలా ఈ పాడు గెడ్డల్లో ఏంపని చేస్తావ్? పాపం గంపెడంత సంసారం సంపాదించే వాళ్ళా లేరు. అల్లుడు వున్నాడా అంటే అప్పులు చేసి తాగేవాడే కాని కాలికిచేతికి అక్కరకొచ్చే

రకమన్నా కాదాయె. ఈ పాడు బాధలతోనే మనిమన్న వాడు బ్రతికినంత కాలం కుళ్ళిపోతే యింకా సుఖపడే దెప్పుడయ్యా? నా మాట విని నీ కిష్టమైతే యీ భూమి నాకు యింతో అంతో చేసి, యివ్వు. చూడు!...నాకేమి యీ చేను పండాలి తినాలి అని కాదనుకో ... ఏదో కులపు వాడివి, అందులో మంచివాడివి, కష్టమైనా నిష్ఠూరమైనా నీవు భరించేవాడివే కాని, యితర్లను చిన్నమెత్తు మాటన్నా అనవు. యేదో కాడిగట్టు చేను, దీనివల్లనైనా నీవు పది రోజులు సుఖంగా వుంటే అదే చాలు. ఏమంటావ్ కాంతయ్యా?

కాం:- ఈ నాటికైనా తమకు నాపై యీ పాటిదయ కలిగినందుకు అదృష్టవంతుణ్ణి.

గం:- నాకు ఒకనాడుమాత్రం జాలిలేదా చెప్పు. ఏదో కాలం, కర్మం కలసిరాకగానీ — పోనీ యిప్పుడు మాత్రం మించి పోయిందేముందిలే, యేదో నలుగురికంటే నాలుగొందలు ఎక్కువే తీసుకో, పిల్లలు గలవాడివి.

కాం:- నా భూమిని యివ్వాడే అమ్మదలచ లేదండీ.

గం:- చిట్టెడు గింజలు, పిడికెడు వరకలు పండని యీ చవిటి భూమి దేనికయ్యా నీకు? అహా! బలవంతము చేస్తున్నానని కాదు. ఏదో నీ బ్రతుకుని గురించి చెబుతున్నాను, తరువాత నీ యిష్టం.

కాం:-బిడ్డనమ్ముకున్నా. భూమినమ్ముకున్నా మంచిదికాదండి, తమవంటి పుణ్యాత్ముల సరసనవుంటే, ఎంతబంగారమైన భూమైనా పండదు. ముత్తయ్యగారు, బళ్ళు తోలిస్తే, మీరు గొడ్లుతోలుతారు. మీరు బలవంతులు, పెత్తం

వారులు, ఊరి మంచి చెడ్డలమీద మీరు ధర్మకర్తలు. కొండల్లాంటి మీ యిద్దరిమధ్యా పిండిలాగా నలిగిపోతు న్నాను, ఈ పదేళ్ళ నుండి. యీ నాటికైనా మీకు దయ కలిగింది కాబట్టి, మీ గొడ్లను రానివ్వకుండావుంటే ఏదో నాలుగుగింజలు పండించుకుంటాను.

గం:- నేను పాలేరు వెధవలకు అనేకసార్లు చెప్పాను. ఆ కాంతయ్య చేలోకి ఎడ్లు, బండ్లు పోనివ్వకండిరా అని ... సరే, వాళ్ళను చీవాట్లు వేస్తాలెండి.

వెం:- (పరిగెత్తుకుంటూ గాభరాగా వచ్చి) యిట్టారండి, [దూరంగా గంగయ్యను తీసికెళ్ళి] నా సామిరంగా పాపయ్య, ముత్తయ్య పరుగెత్తుకుంటూ వస్తున్నారండి.

గం:- సర్లే నువ్వావరో.

కాం:- పాడిగేదె దొరికిందాండి.

గం:- ఆఁ! ... దానితగలెయ్య. ఎక్కడికి పోతుందిలే, ఔను కాంతయ్యా, నువ్వు ముత్తయ్యకు నీ భూమిని అమ్మతానని చెప్పావని, అందుకోసం ఆ ముత్తయ్య, పాపయ్య కలిసి వస్తున్నారంట ... చేను బేరానికి.

కాం:- నేనా! బాబూ, ఎగతాళి పెద్ద వాళ్ళతో ఆడతానా? నేను అనలేదు.

గం:- నువ్వు అనవని నాకు తెలుసనుకో ... ఒకవేళ అమ్మ దలిస్తే, అతనిచ్చే డబ్బుకన్నా.. నాలుగు వందలు ఎక్కువే యిస్తాను, నాకే యిచ్చేయి.

[పాపయ్య ప్రవేశిస్తూనే ఆత్రుతగా]

పాపయ్య:- నాకు తెలియకడు[illegible] కాను, నువ్వు యిక్కడున్నావా[illegible], రా!

యిలారా, నీ అదృష్టరేఖ తిరిగిం దీనాటికి.

కాం:- 8 సంవత్సరాల నుండి తిరగని అదృష్టరేఖ ఈ వేళ అర్థరాత్రే తిరిగిందా ?

పాపయ్య:- నాకు తెలియకడుగుతాను, అదృష్టానికి పట్టపగలు, అర్థరాత్రంటూ ఏమీ లేదయ్యా ? [ఇంతలో ముత్తయ్య వచ్చాడు, గంగయ్యను చూచి కాస్త ఆశ్చర్యపడ్డాడు. గంగయ్య చిరునవ్వు గర్వంగా నవ్వాడు. వెంకడు సకిలించాడు. పాపయ్య చీదరించుకుంటూ]

పాప:- ఆహా అతిరథ మహారథులంతా యిక్కడే వున్నారే ?

గం;-ఊహూ, కానివ్వండి మీ శల్యసారథ్యం.

ము:- ఈ పద్మవ్యూహాలు మాకు తెలుసులేవయ్యా ?

వెం:- కరణం పట్టుకుంటే మరణంతప్పదని, నా సామిరంగా, పాపయ్యగోరేదో పంచికలు పెత్తున్నాడు, కాత్త జాగర్తగా వుండండి, కాంతయ్యగోరూ !

పా:- నాకు తెలియకడుగుతాను, చూశారండి అయినవాణ్ణి, కానివాణ్ణి, నేను దూడబాతులా పీక్కుతింటున్నానా చెప్పండి. అర్థరాత్రివేళ గడ్డివాముల్లో జనపకట్టలు, గడ్డి దొంగతనంజేస్తె ... మొక్కలు యిరగతన్నించుకున్న నీది ఒక బ్రతుకే [వూశాడు]

వెం:- నా సామిరంగా, పిచ్చిగొలతలు కొలిచి, వున్న భూమిని ఆ ముత్యాలయ్య దగ్గర లంచంతిని, రాళ్ళు మార్పించి, భూమి కట్టపెట్టినందుకు పక్కలిరగతన్నలా వాల్లు ? ఛీ ! [వూశాడు] ఇంకా నన్నంటున్నారు. పైగా పెద్దోళ్ళు, గొప్పోళ్లూ.

గం:- ఏమిటిరా యీ పాడుపోడి, ఏం కాంతయ్యా, నువ్వు

అన్నమాటమీాదే వుంటావుగా ?

ము:- కాంతయ్యా, ఒళళ్లకు నీవు అమ్మేదానివిాద ఎనిమిది వందలు ఎక్కువ యిస్తాను. చేను నాకే యివ్వాలి.

గం:- చెప్పరా వెంకా, మనది 8900.

ము:- చెప్పవయ్యా, పాపయ్యా, మనది రు. 9000.

పాప:- ఏమంటావ్ కాంతయ్యా, నాకు తెలియకడుగుతాను, యింకా ఆలోచిస్తావేం ?

వెం:- కాయిరాజా కాయి ! కాంతయ్య గోరూ ? నీ రొట్టె విరిగి నేతిలోపడింది. నా సామిరంగ మాది రు. 10, 000.

ము:- అనవయ్యా మనది రు. 11, 000.

గం:- మాది రు. 15,000 అని చెప్పరా వెంకాయి.

ము:- మాది రు. 18,000.

వెం:- మాది రు. 20,000 ఏందోరా, యింకా ఆలోచిత్తున్నా రేంది ? నా సామిరంగా యిప్పుడు ఇటో, యిటో తేలి పోవాలి మరి.

పా:- ఏంటిరా నీ ముఖం తేలేది. మాది 23 వేలు ఏం ! ముత్యాలయ్యగారూ ?

పిచ్చి:- [పిచ్చివాడు ప్రవేశించి] నాది 50 వేలు. [నవ్వి] నీవంతూ వచ్చింది ? వస్తుంద ! వీళ్ళు సామాన్యులుకారు! రావణ, కుంభకర్ణులు ... జరాసంధ, దంతవక్త్రులు ! హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, [నవ్వి] ధనవంతుల మధ్య దరిద్రులుండరాదోయి ! [వాళ్ళందరితో] పెట్టండి ? బాగా పెట్టండి చేలోనుంచి ? [జాలిగా] అయ్యో ! ఏడుస్తావేం ? నా జోలె, నా కర్ర వస్తుందనా ? నీకు రాదులే; పెద్దవాళ్ళు; గొప్పవాళ్ళు; ఎప్పటికైనా వాళ్ళకేయిస్తా. [నవ్వి] నా

కిచ్చింది వాళ్లేగా! [నవ్వి] నా కధికారం వస్తే... వీళ్ళని రాజుల్ని చేస్తా!

గం:- యీ పిచ్చి వెధవను బయటికి గెంటరా వెంకా?

[వెంకడు వచ్చి వాణ్ణి లాక్కెళ్ళటానికి పైకి పోబో తాడు. కాంతయ్య అడ్డంవచ్చి]

కాంత:- ఉండనివ్వండి. వాడేంచేశాడు; మతిలేనివాడి మాట మనకు పట్టింపేముంది?

వెం:- నా సామిరంగా యిదంతా పిచ్చివాళ్ల సంతలా గుందండీ, చూత్తుంటే!

పాప:- నాకు తెలియకడుగుతాను, ఈ పాడువాగుడు నాకు పనికిరాదండీ?

పిచ్చి:- [కోపంగా] పనికిరాదురా? నా జోలె ఎక్కడ నుం చొచ్చిందో నీకు తెలుసా! పరమశివుడిది. కాదు కాదు; కుభేరుడి కల్పవృక్షం, జమదగ్ని కామధేనువు కోరుకోండి. ఈఅన్నపూర్ణభాండం. వద్దంటారేందిరా వెర్రిపుల్లాయిలూ? [నవ్వుతూ] చెయ్యండి, తగ్గాంగం! నా కాపురం నష్టేటుకలుపండి వస్తానూ! [వెళ్లిపోతాడు]

ముత్త:- ఆఁ... కానివ్వయ్యా, నీ దెబ్బకు తిరుగేముంది?

గం:- పాటపెట్టక... పెద్దమ్మోర్లల్లే చూస్తావేరా, దరి ద్రుడా, మనది రు 24000.

ముత్త:- మాది రు 26 వేలు.

గం:- మాది రు 29 వేలు.

ముత్త:- మాది 30 వేలు,

గం:- మాది రు 32 వేలు.

వెం:- నా సామిరంగ! యిప్పుడేమంటారు, కరణంగోరూ

నీ పాచికలు మాదగ్గర సాగవు.

పావ:- అఘోరించావు లేరా! అణానెత్తిన బెడితే కానీ ఖరీదు చేయని నువ్వూ చెప్పొచ్చావ్? చూస్తారేంటండి! మాది 34 వేలు.

వెం:- ఓయబ్బో! గుడ్డిది బెదిరించి కుండా, చట్టి పగల్నా కిందంట. నా సామిరంగ మాది 37 వేలు.

పావ:- చూశారండి, నాకు తెలియకడుతాగును. తగ్గి పూరు కుంటా రేంటండి,

ముత్త:- ఎవరు తగ్గుతారయ్యా! మినిష్టర్ని కట్టుకొని పేదోళ్ళ భూమికాదు: కాజేయటానికి, పెట్టయ్యా వెయ్యి మీద వెయ్యి.

గంగ :- కలక్టర్ని కట్టుకొని బస్సు రూట్లు కాదు కాజేయ టానికి పెట్టరా పదిమీద పది.

ముత్త :- కాలేజీకి వసూలుచేసిన ఫండు దిగమింగిన నీదీ ఒక బ్రతుకే ?

గంగ:- శానిటరీ హాస్పటలుకు వసూలు చేసిన నిధినంతా పొలాలు కొనుక్కున్న నీదీ ఒకజన్మే ?

ముత్త:-రాజకీయ బాధితుణ్ణిని పాటివిబ్బలు కాజేయలేదు నేను

గంగ:- కరణాన్ని కట్టుకొని గవర్నమెంటు పోరంబోకుల్ని చేలల్లో కలుపుకున్న నీ కంటేనా!

పావ:- హరిజన సేవని యీ త్రాగుబోతు వెంకడిని పెద్దనుజేసి పసిపిల్లలకు చదువుకనే వంకతో ప్రోగుచేసిన డబ్బును దిగమింగింది మీరు కాదు!

వెం:- నా సామిరంగా కరణ పాయన కాకిపిల్లల్లే నోరెత్తాడే పల్లెల్లో సారా బట్టీలవాళ్ళ దగ్గిర వందలకు వందలు కాజే

త్తుంది ఎవరండీ?

ముత్త:- పంచాయితీ డబ్బంతా పోతురాజులల్లే దిగమింగే వాళ్ళతో ఏమిటయ్యా!

గంగ:- ఆ మాటకొస్తే కో-ఆపరేటివ్ స్టోర్సు డబ్బంతా నువ్వు దిగమింగలా?

పాప.- ముత్తయ్యగారూ! నాకు తెలియకడుగుతాను. తిరిప్పె మెత్తే జంగాలందరిది ఒకటే శంఖు; ఒకటే గంట, దానికి తిరునాళ్లు దేనికి, వచ్చిన పని కానివ్వండి.

ముత్త:- మాది రు 35 వేలు.

గంగ:- నేను 38, వేలిస్తాను.

ముత్త:- నేనే అంత చేతులు వచ్చినవాణ్ణి నాది 38 వేల, 5 వందలు.

గంగ:- నాది 39 వేలు,

ముత్త:- నాది 39 వేల, 5 వందలు.

గంగ:- 40 వేలు నాది. ఏంమంటావ్? కాంతయ్యా!

కాం:- బాబూ, బాబూ, మీరు బలవంతులు, నేను పేదవాణ్ణి ఎందుకు బాబూ నన్ను ఎగతాళి జేస్తారు, ఎకరం పొలం 40 వేల లేమిటండీ?

పాప:- నాకు తెలియకడుగుతాను, పాటపెట్టి పాడుతుంటే పరిహాసమంటా వేమిటి? అవుననవయ్యా! మా ముత్తయ్య గారు 40 వేలూ పువ్వుల్లోపెట్టి యిస్తారు.

వెం:- కాంతయ్య గోరూ! నా సామిరంగ. ముందొచ్చింది మా గంగయ్యగోరు. ఈ చేను మాకే అమ్మాలి.

కాం:- నే నెవరికి అమ్మను! వెళ్ళండి.

పాప:-అమ్మవూ! నాకు తెలియకడుగుతాడు, సిరిరా మోకా

లడ్డుతావా ? యిట్లాగే దరిద్రంతో కుళ్లి చావాలనుందా ?

కాం:- నా బ్రతుకు సంగతి నాకు తెలుసులెండి ?

పాప:- చూశారా గంగయ్యగారూ ! మీరూ మీరు కొట్టుకుంటూ వుంటే, కాంతయ్య కళ్ళు పైకొచ్చినయ్. నాకు తెలియక అడుగుతాను. మీ యిద్దరి విరోధాలూ మీ వినాశనానికే దారితీశాయ్. యిక 40 వేలకంటె కానీ ఎక్కువ పెట్టరాదు.

వెం:- నా సామిరంగ, ఏదో పాచిక ఏత్తున్నాడండోయ్ పాపయ్యగోరు.

గం:-నువ్వుండరా, పాపయ్యగారూ, యిలారండి. [దూరంగా తీసికెళ్ళి చెవిలో ఏదో చెప్పాడు పాపయ్య, మరలావచ్చి ముత్తయ్యను తీసికెళ్లి ఏమిటో చెప్పాడు]

పాప:-యిప్పుడు తేల్చవయ్యా కాంతయ్య, నువ్వు మర్యాదగా యీ చేను అమ్మకపోతే బలవంతంగా యీ చేనుస్వాధీనం చేసుకుంటాం. షోర్జరీ దస్కత్తులు చేయటంలో నా సంగతి నీకు తెలుసునుగా. ఇప్పుడు గంగయ్య ముత్తయ్య ఏకమైనారు. అవునంటే ఆ 40,000.లు వస్తయి, లేకపోతే చిల్లిగవ్వకూడా రాదు, చెప్పతున్నాను, అన్యాయంగా చనిపోతావు

కాం:- ఎనిమిది సంవత్సరాలనుండ యీ భూస్వాముల దౌష్ట్యానికి చచ్చిపోతూనే వున్నాను, బంగారంలాంటి భూమిలో పిడికెడు పరకలు, చిట్టెడుగింజలు పండకుండా: నాశనం చేస్తూనే వున్నారు. నా భార్యాబిడ్డలు ఆకలితో, దరిద్రంతో చచ్చిపోతూనే వున్నారు. పేదరైతు నోట్లో దుమ్ముచల్లి. మీరుచేస్తున్న అన్యాయానికి చచ్చిపోతూనే

వున్నాం. యింతకన్నా యింకేం చచ్చిపోతాం. సరే కానివ్వండి. ఎవరి అదృష్టానికి ఎవరు కర్తలు. యిప్పుడు, ఈ క్షణంలో ఎవరు 40, వేలిస్తే, వాళ్లకిస్తాను; యేమంటారు ? ఎవరిస్తారు ?

పాప:- నాకు తెలియకడుగుతాను, యింకా నూస్తారేమిటండీ; గంగయ్యగారూ ! ముత్తయ్యగారూ ! పూర్వవిరోధాలు ప్రక్కన పెట్టి కలిసిరండయ్యా.

ముత్త:- సరే, పాపయ్యగారూ. చెప్పినట్లే చేస్తాం.

గంగ:- కరణం మాట కాదనే దేముంది.

పాప:- పదవయ్యా, పద నీ అదృష్టం పండిందిలే ?

వెం:- నా సామిరంగా, ఈ కరణంగారి పాచిక మరణానికే వచ్చిందో, మంచికే వచ్చిందో మరి, ఈ దూడబాతుల వెంకడ్నికూడా కాత్తమర్చి పోకండి దొరా

[గంగయ్య,ముత్తయ్య, చేతులుకలుపుకుంటారు. గర్వంగా నవ్వుతా వెళతారు]

పాప:- పదవయ్యా, కాంతయ్య పద.

కాం:- [మట్టితీసికొని కళ్లద్దుకొని] తల్లీ ! నిన్ను యింతకాలం నమ్మాను. ఈ వేళతో నీకూ నాకూ ఋణం తీరింది. వస్తా

వెళ్ళిపోతున్నా - సెలవిమ్మా భూదేవి
కన్నబిడ్డను మించి - కడుమమత చూపించి
ఇన్నేళ్ళు నినుబెంచి - ఏమేమో ఆశించి — వెళ్లి
ఆశలన్నిటి తుంచి - ఆపదల నినుముంచి
విడని భారాముంచి - విధికి వప్పగించి — వెళ్లి
ఇరుగు పొరుగులపోరు - ఈ నాటితో తీరు
తీరునా నీ ఋణము - మారుతలే యీ జగము — వెళ్ళి.

కడసారి కన్నీట - తడిచేను యీ చోటు
కడసారి నినువీడి - విడిచి నినుపోలేక ... వెళ్లి.

కాం:- [కళ్ళ నీళ్లు తుడుచుకుంటూ వెళ్ళాడు. అంతా నవ్వు కుంటూ వెళతారు]

తెర

— : —

# లం కె ల బిం దె లు

## రెం వ రం గం

[రా త్రి స మ యం]

[తెర లేచేసరికి వెనుకటి సీను కనుపిస్తుంది. లోపల లైట్లు వెలుగు తుంటాయ్. రెండునిమిషాల అనంతరం గంగయ్య, ముత్తయ్య, వచాన్లు చేస్తూవుంటారు. కరణం కొబ్బరి కాయులు, హారతి కర్పూరం వగైరా తీసుకొచ్చాడు. ఒక మేకపిల్ల చేతిలో పెద్దకత్తి పట్టుకొని నాలుగు కోడిపెట్టల్ని తీసికొని వెంకడొస్తాడు.]

ఘరాన దొంగలురా! ఘరానా దొంగలురా! బలే
పెద్ద మనుషుల్లాగ పైకి కనిపిస్తారు పట్టపగలే పీక
పట్టి తెగగోస్తారు ఘరానా.
తేనెపూసిన కత్తి తీరూనంటూరు సాలీడు వలపన్ని
చంపుతా మంటారు ఘరానా.
పేదసాద- దోచి పెత్తనము చేస్తారు

చాటుమాటున నక్కి కాలేసిపోతారు ఘరానా.

పాప:- [లోపలనుంచి] ఒరే! వెంకాయ్? కాస్త దూరంగా నిలబడు. పవిత్రమైన స్థలంమీద నీ పాడు పాదం దేనికి? కాస్త దూరంగా అఘోరించు.

వెం:- నా సామిరంగా! నీ పూజలు, పునస్కారాలు అయ్యేటప్పటికి తెల్లారుద్ది.

ముత్త:- [బయటనుంచి] మీ పాడు సోదితో ప్రొద్దుపుచ్చక త్వరగా తెమల్చండయ్యా?

గం:- వాళ్ళెక్కడ తెములుస్తారండి? ఊరిజనానికి తెలిసి ఉసీళ్ళ పుట్టలావచ్చి పడిందాకా ఇట్లాగే చేస్తూవుంటారు.

పాప:- [వస్తూ లోపలనుంచి] ఏర్పాట్లన్నీ చేశాను వచ్చి ప్రారంభోత్సవం చెయ్యండి, ముత్తయ్యగారూ! నాకు తెలియకడుగుతాను, మంచిలగ్నం దాటిపోయిందంటే...

(వెంకడు మధ్యలో వచ్చి)

వెం:- నా సామిరగా, ప్రూరి పెసిడెంటు గంగయ్య గారుంటే పుట్టాయన్ని చేయమంటారేంటి?

పాప:- నాకు తెలియకడుగుతాను, ముత్తయ్యగారు మాత్రం గ్రామాధికారి కాదట్రా? గ్రామాధికారి చేతుల్లో స్వర్ణరేఖ వుందిరా? ఆయన చేత్తో తాకాడంటే మట్టికూడా బంగారమవుతుంది. శాస్త్రం తెలియని వెధవ్వి నువ్వు చెప్పడమేమిటి? మేము వినడమేంటి? హస్తసాముద్రికములో ఆ ఆనందయ్యదే అందెవేసిన చెయ్యి.

వెం:- నా సామిరంగా! ఏందండీ? ఆ ఆనందయ్యకు చాత్రం తెలుసు, చాత్రం తెలుసంటారు. అంత తెలిసినోడు, ఆయన కూతురు పెళ్ళికి లగ్గం పెడితే మొగుడు మూడో

నాటికే ఎందుకు చచ్చాడంట!

పాప:- అంతులోనే వుందిరా అతి [illegible] ఆ పిల్లకు [illegible] కాగానే వైధవ్యం రాత వుంద[illegible] తెలుస్తే. అటు ఆ పిల్లకు పెళ్లికాలేదని [illegible] మొగుడు తాలూకు ముప్పై [illegible] ముహూర్తం తెలిసే పెట్టాడు.

వెం:- నా సామిరంగా, ముండాదక్కే... [illegible] స్తాను.

పాప:- నాకు తెలియకడుగుతాను. మాటకోసం కావట్రా అర్ధరాత్రిపూట యీ పాట్లన్నీ, ఏమండీ గంగయ్యగారూ, మీ అభిప్రాయం ఏమిటి?

గం:- ఈ పుణ్యకాలం కాస్తా దాటి పోకముందే పని ప్రారంభించండి. ఎవరు చేస్తే ఏముంది?

పాప:- రండయ్యా, రండి! (అంతా లోపలికి వెళతారు)

పాప:- (లోపల) ముత్తయ్యగారూ, ఈ మంత్రోదకం తీసుకోండి. ఇదిగో యిక్కడ... యిక్కడ. ఆ. ఈ కొబ్బరికాయ కొట్టండి. నువ్వింకా తాడిచెట్టులా నుంచున్నావేరా. ఆ కత్తి తీసికొని కోడిని అందుకో, రక్తాభిషేకం జరిగితేగాని లంకెల బిందెలు బయటికిరావు.

[లోపల కోళ్ళు, మేక అరుపులు వినిపిస్తుంటాయి]

పాప:- ముత్తయ్యగారూ, ఈ పలుగు అందుకోండి! ఇదిగో, ఇక్కడ... సూటిగా వెయ్యండి [పలుగు వేసిన చప్పుడు వినిపిస్తుంది. ఒక్క నిమిషము తరువాత గంగయ్య ముత్తయ్యలు బయటికి వస్తారు]

ముత్త:- అప్పుడే అర్ధరాత్రి దాటిపోతున్నట్లుంది. గురకొయ్యలుకూడా ఏటవాలి పోతున్నాయి.

గం:- అసలు తెల్లవారే సరికి, ఈ పని అవుతుందా,... అని

ము_త్త:- కావాలి... కాకపోతే కష్టమే మరి ?

గం:- అంతకాకపోతే భాగాలపంపిణీ ఎలాగున్నా ఆ బిందెల్ని మా యింటికి పంపుతాలెండి.

ము_త్త:- మీ యింటికి పంపుతారా ? మీ యింటికి వచ్చేజనం పోయేజనం ఒకటే రాష్ట్రదండాయెను మా యిల్లుదారిలో నేగా, పదిమంది కంటపడకుండా మా యింట్లో పెడితే బాగుంటుంది ?

గం:- మీ యింటికి గోడలు గట్టిగా లేవు. మొన్న దొంగలు పడి భోషాణం ఎత్తుకెళ్తే చేసేది యేమిలేక వూరుకుంటిరి. మీ యింటి కంటె మా వెంకడిల్లే గట్టిగా వుంటుంది.

ము_త్త:- వెంకడా ! సరిపోయింది. వాడికి పానలా దొరికితే సుబ్బాంకిచ్చి దానియింటిముందు పాణాశారం పడతాడు. మొన్నమీరు తాలూకాలో చలానా కట్టిరారా అని పది రూపాయిలిస్తే... ఆ సుబ్బాం గుడిశెలోదూరి పదిరోజుల దాకా పత్తాలేకుండాపోయె ! మీకు అభ్యంతరం లేకపోతే మా కరణం యింట్లో పెడతాను.

గం:- కరణం యింట్లో పెడితే కానీగూడ చేతికి రాదు.

ము_త్త:- ఇట్లా మీరు అడుగడుగునా అనుమానాలు పేచీలు పెడితే లాభంలేదు. మనిషన్నవాడికి యేదో ఒక తెంపు వుండాలి.

గం:- అదే నేననేదికూడా. మనలో ఎవర్ని నమ్మదామన్నా కంపుగావుండె. అయ్యకి పుట్టిన ఆరుగురు కొడుకులూ అంతా ఒక మతస్తులే ! ఎవర్ని నమ్మేటట్టు !

ము_త్తే:- నాకు ముందే తెలుసు, యిట్లాంటి మారా ముళ్ళు న_స్తయ్యని.

గం:- నాకు ముందే తెలుసు యీ పొత్తు కుదరదని.

ము_త్తే:- మన యిద్దరిది ఉ_త్తర దక్షిణ ధ్రువాలయిపోయె.

గం. నువ్వేగా మొదటి నుంచీ నన్నేదో సాధించాలని పార్టీ లేవదీసింది.

ము_త్తే:-అయిన వాడని నన్ను పంచాయితీబోర్డు ప్రసిడెంటును జేస్తే ..పరు దాటి తెప్పతగలేస్తివి

గం:- అదుగో! ఆ కూతలే నిన్ను కూడెముక్క నేది? బస్సు పరిమిట్లలో భాగం పెడతానని పెట్టా?

ము_త్తే:- నువ్వా దిగమింగిన వాటిల్లో నాకు పెట్టా వేమిటి?

గం:- ఏమిటి నీకు పిచ్చేం? ఆ దొమ్మీ కేసులో నన్ను యిరికిద్దామని చూడలా!

ము_త్తే:- ఏమిటి నీకిచ్చేది? ఆ దొమ్మీ కేసులో వెంకడి చేత నన్ను నరికిద్దామని చూడలా?

గం:- అదుగో! ఆ బుద్ధితక్కువ కూతలే కూడెద్దనేది.

ము_త్తే:- అదుగో! ఆ చేతగాని వాగుడే వాగొద్దనేది?

గం:- నాది చేతకాని వాగుడా!

ము_త్తే:- నావి బుద్ధితక్కువ కూతలా! అసలేందోయ్ నీ సొణుగుడు!

గం:- అసలేందోయి నీ అఘోరింపు!

[యిద్దరు ఒకరొకరు చేనులు కలిసేటంత పెద్దగా అరుస్తుండగా పాపయ్య లోపల నుంచి అరుస్తూ, కాసుల పేరు పట్టుకొని పరుగెత్తుకు వస్తాడు]

పాప:- ము_త్తయ్యగారూ! గంగయ్యగారూ! నిక్షేపం, నిక్షే

పం, బయటపడింది. నాకు తెలియకడుగుతాను. ఈ కాసుల పేరు చూడండి! నవరసు బంగారంలావుంది.

ముత్త:- [పాపయ్య చేతిలో గొలుసు ఆత్రతగా లాక్కొని] నవరసు బంగారం ఏమిటయ్యా! జమీందారు యిళ్ళల్లో మేలైన బంగారం వుంటుందయ్యా! మేలైన బంగారం.

వెం:- [నవ్వుతూ] నా సామిరంగా! పలుగు మాటిగా సూసి నాటేను. ధనబ్బిండెల్లో పడి ఖంగున మోగి పలుగెంబడి లేసొచ్చింది.

పాప:- నాకు తెలియకడుగుతాను. ఇదంతా నీ ప్రతాప మని ఏమన్నావేమిట్రా! ఈ పాచికల పాపయ్య ప్లానువేసి పలుగు నాటిస్తే, పాతాళ గంగ కూడా పైకిలేచి రావలసిందే. ఇంటిముందు వీధి ఎక్కడికి వెళ్తుందో తెలియని వెధవ్వి.. భూగర్భ శాస్త్రం తెలిసినట్లు మాట్లాడతావేమిరా! ఇది శాస్త్రమోయ్! శాస్త్రం!

గం:- శాస్త్రం లేదు, శింగినాదం లేదు, ముందుపోయి మీపని చూడండి. తెల్లవారవస్తుంటే తిరునాల చేస్తారేం?

పాప:- నాకు తెలియకడుగుతాను! నీ వెందుకొచ్చావురా. అంట్ల వెధవా. ప్రతి దాంట్లోను తగుదునని తయారవుతావ్ పద... పద !

వెం:- నా సామిరంగా! రెక్కలు విరగ్గొట్టుకునేవాణ్ణి నేను? లెక్కలు రాసుకునే వాడివి నువ్వు? పట్టి కోతమాటలు మాట్లాడతావేంది? రా... రా. [వెళ్ళారు]

ముత్త:- ఇది మంచి బంగారమే నంటారా?

గం:- మంచిబంగారమో! మట్టిబంగారమో మనకేం తెలుసు పోనీ, విశ్వకర్మ వీరాచారికి చూపిస్తే.

ముత్త:- వాడా! వాడంత దొంగముండా కొడుకు మరొక
డున్నాడా? ఆ మాదిగవాళ్ళ బంగారమంతా అమ్ముకొని
అర్ధరాత్రి పారిపోయిన వాడికి, ఈ రహస్యం చెప్పుతారా
మీా కిష్టమైతే బసవాచారికి చూపిద్దాం
గం:- ఛీ! ఛీ! ఆ లుచ్ఛా పేరెత్తకు, చన్నపనెళ. ఆ పూజారి
కోడలు గజ్జెల వడ్డాణానికి బంగారం యిస్తే, అదంతా
రాజేసి, కాకిబంగారం వాళ్ళ ఎదాన కొట్టాడు.
ముత్త:- మరి యీ బంగారం అమ్మకానికి పోయేదెట్లా?
గం:- అట్లా లేదు. చూట్లూ లేదూ... కొడుకు పేరు సోమలింగ
మన్నాడంట! ముండా క్షేమం మన చేతికి రావొచ్చింది.
ముత్త:- యింత దూరం వచ్చింది చేతికి రాకుండా ఎక్కడికి
పోతుందండి! నేను అప్పుడన్నది; మీారు కాదంటారాయె!
ఎట్లా తేలి చచ్చేది.

గం:- నువ్వు మాత్రం ఎక్కడ ఊరుకుంది; అయినదానికి
కానిదానికి అడ్డొస్తావాయె
ముత్త: ముందొచ్చింది మీాకా? నేనా?
గం:-మీారే! మీా మాలంగానేగా? వాడి ఎదాన 40 వేలు
తగల పోశాం.
ముత్త:- ఈ మాత్రపు ఆలోచన మీాకు ముందేవుంటే అర్ధ
రూపాయి. అర్ధ రూపాయితో, నేను వాణ్ణి అవుతలకు
గెంటేవాణ్ణి. ఈ నష్టమంతా మిమ్మల్ని గురించే.
గం:- పాపం! పిల్లలు గలవాడు ఆ మాత్రమన్నా తిననివ్వా?
మరీ అన్యాయం చేస్తే మనకు వాళ్ళ ఉసురు తగుల్తుంది.
ముత్త:- ఈ చాదస్తమే నా దగ్గర పనికిరాదు. అంత దయగల
వాడివి... ఏనిమిదేళ్ళ నుండి వాడి ఛేనంతా గొడ్లుతోలి

ఎందుకు మెపించావ్ ?

గం:- నువ్వు మాత్రం నిర్వాకం చేసింది ఏముంది ? నువ్వు బండ్లు తోలించి, వాణ్ణి నాశనం చేయలా ?

ము త్త:- సరేలెండి ! మన కంతలు, మనం త్రవ్వకో ప్రారంభిస్తే మన్వంతరాలు గడచినా తరగవు,

[ఇంతలో పాపయ్య, వెంకడు ముఖం వేలవేసుకొని వచ్చారు]

ము త్త:- యేమయ్యా ? త్రవ్వకుండా వచ్చారు ?

వెం: యేం ? తవ్వా మండీ ! నా సామిరంగా, తవ్వీ, తవ్వీ, పాతాళం కనిపించినా, ఆ పాడు బిందులు కనిపించకపోయె

గం:- యేమండీ, పాపయ్యగారూ ! అంతేనంటారా ?

పాప:- నాకు తెలియకడుగుతాను; దానికి అంటే ఆ ధన లక్ష్మికి రక్తాభిషేకం చాలలేదు. అదుకే అవి మన కంటికి కనుపించడం లేదు.

ము త్త.- మరి యిందాక ఖంగున పలుక్కి తగిలిందన్నావు కదారా ?

గం:- నీకు భూగర్భ శాస్త్రం తెలుసన్నావుగదయ్యా ! అవి ఎక్కడున్నచో ఆ మాత్రం తెలియలా ?

పాప:- తెలియకేమండీ ! ఆ ధనలక్ష్మికి చాలినంత ఆహారం కావాలి. ఈ విషయంలో బాగా ఆలోచిస్తే అవి నరబలి లేకుండా ! నరుడి కంటబడవ్ ?

ము త్త:- చచ్చావే ! యిప్పుడు మనిషిని చంపాలంటావా ?

పాప:- తప్పనట్లే వుంది !

గం:- ఏం తప్పనంట్టుంది, మన కిప్పుడు చావటానికి ఒప్పుకునే మనిషి ఎవడున్నాడు.

ము:- పెద్దచిక్కే నే [ఆలోచిస్తూ కూర్చున్నాడు]

గం:- అన్యాయంగా 40 వేలు మట్టిలో పోశాం. యిప్పుడేమి చేయడం. [ఆలోచిస్తూ కూర్చున్నాడు]

వెం:- నా సామిరంగా, యిప్పుడు కనబడాల, కరణంగోరి పాచి కల పనేమిటో. (కూర్చున్నాడు)

పా:- కథంతా అడ్డంతిరిగిందే (కూర్చున్నాడు ఆలోచిస్తూ—కాసేపాగి) నాకు తెలియకడుగుతాను, నరబలి యివ్వ టమో, యీ పని మానుకోవడమో జరగాలండి.

ము:- ఇంతదూరం వచ్చాక మానుకుంటామా.

గం:- మరి ఏం చేద్దామని?

వెం:- ఈ ఉపాయం కరణగారే చెప్పాలిమరి?

పా:- నాకు తెలియకడుగుతాను. ఉపాయం చెప్పగానే సరి పోతుందా? పనికావద్దు? ఏమండీ! ఏకంగా నరబలి యివ్వటం మీ యిద్దరికీ యిష్టమేనా?

ము:- ఇష్టంకాకపోతే, యీ యాతనంతా ఎందుకు?

గం:- అందు కిష్టపడ్డ మనిషి ఎవడు యీ అర్ధరాత్రి దొరుకు తాడా అని!

పాప:- ఇష్టపడి ఎవడు ప్రాణం తీసుకుంటాడండి. యేదో మారోపాయం. చేయాలిగాని! నాకు తెలియకడుగు తాను! ఏమంటావురా వెంకా?

వెం:- కరణంగోరు సెప్పింది మా కరట్టండి! నా సామిరంగా సందునూసుకొని ఏ బికిగాణ్ణో ఎత్తుకొత్తేసరి.

పాప:- ఛీ...! ఛీ...! దరిద్రపు ముండాకొడకా! కుంటి, గ్రుడ్డి, అకుగాడు, బికుగాడు ఈ పవిత్రమైన పనికి పనికిరా రురా! మంచి కులమున్నవాడూ...గుణమున్నవాడూ...

మంచి రక్తమున్న గోత్రీకుడు కావాలిరా!

ముత్త:- అర్ధరాత్రివేళ అన్ని హంగులు కలవాడు ఎక్కడ దొరుకుతాడయా?

వెం:- ఆc ... వుండండిదొరా! నా సామిరంగా! గ్యావకం మొచ్చిందిలే! ఏందొరా! తెమ్మంటారా మడిసిని?

ముత్త:- అల్లరి కాకుండా తేవాలి. పదిమందికి తెలిస్తే పరువు పోయి ప్రాణం మీదికొస్తుంది.

గం:- చిక్కుల్లో పడకుండా చూడు! త్వరగా వెళ్ళు?

వెం:- నా సామిరంగ. పొరపాటనేది పరమాత్ముడికి కూడా వుంటుంది. నూడండి నరుడికంటబడకుండా మడిసినెత్తుకొత్తా. [వెళ్ళాడు]

ముత్త:- రావయ్యాః రా చూద్దాం. [అందరూ లోనికివెళ్లారు]

పిచ్చి:- [ఇంతలో పిచ్చివాడుప్రవేశించి] ఆపారే త్రవ్వండి. త్రవ్వగా త్రవ్వగా మీ తాత ముత్తాతలు బయటి కొస్తారు. పాపం. యిప్పుడాపితే యీ కష్టమంతా బూడిదపాలే? శ్రమంతా అడవి కాసిన వెన్నెలే.
ఈ కాస్తకు బద్దకించితే, - నరకంలో దిగబడి పోతాం. కష్టానికి, నిష్టురపడితే, - అసలెందుకు మొదలెట్టారోయ్! కష్టకాలమంతా గడిచి - ఈ కాస్తలో వదిలేస్తారా? [నవ్వి] బలే! బలే! మీ కందరికీ కలిపి ఒకటే గొయ్యి త్రవ్వకొండి... ఆc... నాకు మాత్రం త్రవ్వండి. [ఏడ్చి] ఊ...! ఇది వరకు నన్ను గొయ్యి తీసి పూడ్చివేశారుగా. యిప్పుడింకా పూడ్చేదేముంది? ఇదిగో మీరిచ్చిన జోలె కర్ర భద్రంగానే వుంచాను. నా బండెడు సంసారాన్ని తీసుకొని చస్తున్నారూ! చావండి? నాకు బలే హాయిగా

వుందిలే. [భయంగ] ఏమిటి? నా వంక అలా దయ్యాల్లా చూస్తారు? చంపుతారా? వద్దు...వద్దు

గం:- [వచ్చి కోపం ఆపుకోలేక కొట్టబోతాడు, కరణం గంగయ్యను పట్టుకొంటాడు] వదలిపెట్టండి వీణ్ణి రెండుగంతాను.

ము త్త:- (ఇంతలో వచ్చి) మా నుంచి ప్రతాతమే పిచ్చివ డి మీాదనా?

పాప;- వాణ్ణి కదిలిస్తే వాడి పిచ్చి మనకెక్కుతుంది. నాకు తెలియకడుగుతాను, అసలేమిటి కథ?

ము త్త-: అందులో ఏరహస్యంవుందో? మాన కేం తెలుసు?

వెం:- [ఒక మనిషిని కాళ్ళు, చేతులు కట్టి, నోట గుడ్డలు కుక్కి, తలమీాద ముసుగువేసి భుజంమీాద మోసుకొచ్చి ఎత్తి పడవేశాడు] [రొప్పుతూ] నాయాల్ని, మోసుకొచ్చే టప్పటికి నడుములు జారినై. నా సామిరంగా, ఇక చూసుకోండి!

పాప:- చీకట్లో చూస్తే చిన్నవాడులాగా ఉన్నాడు బాగా రక్తం పట్టినవాడే, నాకు తెలియకడుగుతాను ఇక కానిద్దామంటారా?

ము త్త:- ఇంక ఆలస్యమెందుకు? తెల్లవారొస్తుంది. తీసుకెళ్ళరా వెంకాయ్ లోపలకు,

గం;- ముందు కత్తి తీసికొచ్చి పదును పెట్టరా? కానివ్వయ్యా నీ మంత్రాలు, తంత్రాలు.

[వెంకడు కరణం, లోని కెళ్ళాకు. గంగయ్య. ము త్తయ్య పచార్లు చేస్తుంటాకు. వెంకడు బయటికొచ్చి రాయిమీాద కత్తి నూరుతూ వుంటాడు]

గం;- ఎవడో! కొంపా, గోడూ, లేనివాడిలా వున్నాడు.

ము త్తి:- ఎవడైతేనేం ? మన అవసరానికి పనికి వచ్చాడు ?
వెం:- [కత్తి అటూ, ఇటూజూచి] ఈ దెబ్బతో పాతాళంలో వున్న బింకెలు పైకి రావాలి. [పెద్దగా] కరణంగోరూ ? నా పని అయింది. ఇక మీదే ఆలస్యం.
గం:- అరవమాకురా, గాడిద కొడుకా, ఎందుకట్టా గళ్ళె గొంతు వేసుకొని అరుస్తావ్, ఎవడన్నా పసిగట్టాడంటే ప్రాణం మీదికొస్తుంది.
ము త్తి:- ఈ మడ్డిముండా కొడుక్కి మంచి, చెడ్డా తెలిస్తేగా అంతా అలగాకి మేళం.

వెం:- దున్నేటప్పుడు, దూళ్ళల్లోను మేసేటప్పుడు ఎడ్లల్లోను అని చింతాకంత పని నీ వల్ల కాదు. వూరికే అట్టా చిర్రూ బుర్రులాడతా వేమయ్యా ? కట్టపడేది నేను, కట్టుకు పొయ్యేది మీరు, అంత గుట్టుగా చేసుకొనే వాడివి నువ్వే చేసుకోవయ్యా. [కత్తి క్రింద పడేశాడు]
గం:- పదోచనువుకొద్దీ మాట్లాడితే అంతకోపమైతే ఎట్టా రా?
వెం:- ఏందండీ, ఆయనవల్ల నాకు కానీ వచ్చేదా, సచ్చేదా ? నా సామిరంగా, మాటలెందుకు పడాల్నంట.
గం.- ఆయనకోసం చేస్తున్నావట్రా, మనకు మాత్రం భాగం లేదు. [కత్తి ఎత్తి చేతి కందిచ్చాడు]
పాప:- [వచ్చాడు] ఏర్పాట్లన్నీ చేశాను. ఎత్తుకురా వాణ్ణి
ము త్తి:- తీసుకెళ్ళరా ? తీసుకెళ్ళు ?
గం:- జాతర చేయకుండా పని జరగనివ్వండి.
వెం:- నా సామిరంగా, దూడబాతుల ఎంకడికి యియ్యాల చేతినిండా పని తగిలింది, పదవయ్యా, పాపయ్యగోరూ. [బలవంతంగా ఆ మనిషిని ఎత్తుకొని లోనికితీసుక వెళ్తుంటే

గిలాగిలా తన్నుకుంటూ వుంటాడు. లోపల తురలా గోల వినిపిస్తుంది. బయట ముత్తయ్య, గంగయ్య, తిరుగుతూ వుంటారు]

పాప;– ఒరేయ్! అట్లాకాదురా? నాకు తెలియకడుగుతాను గణాచారిలా కత్తి పట్టుకొని ఎగురుతా వేం? ఇదిగో తల తెగగానే రక్తం గోతిలోపడాలి ... తలకాయ గోతిలో వాల్చు ... అదుగో? ఆ మెడకు కట్టిన గుడ్డ వూడదీయి.

వెం:– ఓరి నాయాలా. కోడిపిల్లల్లె కాళ్ళు, చేతులు తన్నుకుంటా వేంది? పెద్దల్ని తల్చుకో. కత్తి గొంతుమీద పెట్టబోతున్నాను. అట్టా వూంటా

పాప:–ఆ నోట్లో గుడ్డలు .. గుడ్డలు లాగివేయరా, [వెంకడు గుడ్డలు లాగివేస్తాడు.]

కొత్త:–అమ్మో, నాయనో, బాబో. మీకు దణ్ణం పెడతాను మీ కాళ్ళు పట్టుకుంటాను. నన్ను . నన్ను రక్షించండి.

వెం:– రచ్చన్లేదు, గిచ్చన్లేదు నోర్ముయ్యవే.

కొత్త·– అమ్మో, [వెర్రికేక వేశాడు]

గం;–[త్రుళ్లిపడి] ఎవరిదండి ఆ గొంతు. నా అల్లుడిదిలాగుందే [పెద్దగా] ఓరేయ్, వెంకాయ్, ఆపు. [లోనికి పరుగెడతాడు] ఒరేయ్. ప్రభాకరం, నువ్వట్రా . నువ్వట్రా.]

ప్రభా:– [ఏడుస్తూ] నేనే మావయ్యా, నేనే మావయ్యా!

గం:– [కోపంగా] గాడిదకొడకా. మనిషిని తీసుకొస్తానని పోయి నా అల్లుడిన్ని తీసుకొస్తా?

వెం:– రచ్చించండి దొరగారూ! రచ్చించండి ఆశివాలయం మంటపంమీద పడుకోనివుంటే, ఖాటసారనుకున్నాను, బుద్ధిగడ్డితింది.

గం:- నోర్మూయ్! [లాగికొట్టాడు, శబ్దం బయటికి వినిపిస్తుంది]
[వెంకడు వచ్చి స్టేజీలో పడతాడు; ముత్తయ్య, గంగయ్య కరణం, ప్రభాకరం బయటికికొస్తారు.]

గం:- బుద్ధిలేని గాడిదకొడకా, మొఖం చూడకుండా మని పిని పట్టుకొస్తా? అన్యాయంగా నా అల్లుణ్ణి చంపేవాడివేనే?

ము:- అయ్యో రామా, మీా అల్లుణ్ణి పట్టుకొచ్చాడు, గొడ్డు మాంసం తినే గాడిదికొడకా? గుడ్లు మూసుకు పోయి నయ్యాట్రా.

పాప:- ఓరి నీయమ్మ కడుపుకాల, నాకు తెలియకడుగుతాను నీకు తెలుసునని చేసుకొచ్చిన నిర్వాకమిదా? అన్యాయంగా ఆ అబ్బాయిని చంపేవాడివే?

గం:- అంకంత కొంపవుంటే, ఆ శివాలయం మండపంమీాదకు ఎందు కొచ్చావురా నువ్వు!

ప్రభా:- మీారు నిద్రపోయే మనుష్యుల్ని తీసుకొచ్చి నిలువునా చంపుతారని నేనేం కలగన్నానేం? ఇంటికాడ నీ కూతురు పోరు, ఆ యధవముండ పోరు పడలేక ఆ మంటపం మీాద పడుకున్నా. ఇల్లరకానికి వచ్చానని ఒకటే సాధింపులు, వేధింపులూను.

గం:- ఇంకా నిలబడ్డావేం? వెళ్ళు, వెళ్ళు సిగ్గుసెరం లేకపోతే సరి. [గంగయ్య కోపంగా వెంకడి వంక చూశాడు. వెంకడు తల తిప్పుకున్నాడు. ప్రభాకరం వెళ్లాడు. బెదురుతూ]

ము:- ఇంకా నయం, తెల్లవారి లేచిన వేళావిశేషం మంచిది. [ఇంతలో పోలయ్య వచ్చాడు. వస్తూనే గంభీరంగా నట శా[ గేసమడిలా ఫోజుపెట్టాడు]

పో:- [ఆశ్చర్యంగా] నువ్వా?

పోల:- ఔను, నేనే! విస్మరించితివా? మాతృపరిదగ్ధ సంతాప విలాప, దుఃఖాగ్ని, సందేశ వార్తాహాసండనై, యుదయించిన, హరిభయంకర, నటగంభీర, నటవిరాజిత, నాట్యకళా ధురీణ, నటకానసంత, సువర్ణ హస్తగంటా కంకణ మహా బిరుదాంకిత.. (శ్రీ) (శ్రీ) (శ్రీ) మురికిపూడి ముక్కోణపు ముత్తయ్య నామాఖ్య తనూజుండ. పోలయ్యనైన నన్నే విస్మరించితివా?

ము:.. అసలు వచ్చిన విషయం ఏడవరా? ప్రాణం మీదికొచ్చి మేముచస్తుంటే, ఈపాడు నాటకాల గోడవేమిట్రా

పోల:- నాటకమా, యీ అఖిలాండ బ్రహ్మాండమే ఒక నాటకం అందు నీవూ నేను సూత్రధారులమే! క్షుద్రపదవీ వ్యామోహ పీడితులై; అధికార గర్వాంధ మదాంధులై; దుర్భర, దుస్సాహ మర్మదాంధులై కుటిల, పిశాచ, భేతాళ తాంత్రిక మూకలై, నిస్సహాయ, నిరుపేద, నిరాధారులపై రాక్షస కృత్యంబులు సలుపు మీకు... నాటక కళయున్నా, నాటక రసాస్వాదనమున్నా, నువ్వగింజలో నూరో భాగమైననూ తెలియునా? ఛీ ..! కళామ తల్లినే దూషించెదవా! ఏల నీ నాలుక శతధావిభిన్నమైపోను. కోటిల మాయోపాయంబులతో ధనమును కూడబెట్టుట కాదు... కళయన్న నీ కేమి తెలియును? దానిని నిందించుటకు నీ వేమి అర్హుడవు?

పాప:- నాకు తెలియకడుగుతాను. అసలు నీవు యిప్పుడు దేనికొచ్చావిక్కడికి?

పోల:- శ్రీవారో అపరశకుని స్వరూపులైన పాపయ్య గారూ, కృతఘ్నులై, దురాశా, పీడితుండైన... నా జనకుని...

ఈ నిశీథ, నిబిడాంధకార. బంధుర. నిర్జన ప్రదేశంబునకీడ్చి కపట వ్యూహరచనా చతురంగ పారంగతులైన మీరు. . . గాలించునదేమి? స్వర్ణకుంభా న్వేషణాయత్త చంచల చిత్తులై... నా యిల్లు నట్టేట ముంచుటకు పన్నిన పన్నా గమాయిది? ఓరి దుష్టా! నేను నీ టక్కరి మాయల నెరుంగని తెలివి తక్కువ తుంతనను-కొంటివా?

వెం:–నా సామిరంగా, తుంతనో, కొంత్రినో ఏందయ్యా బాప్మ్మ లాటలో కేతిగాడల్లే బుడ, బుగ వాగుతావ్. ఆ సెప్పే దేందో సరిగా సెప్పిశా.

పోల:– ఓరి దుష్టా! ఏమిరా నీ ప్రలాపం. మద, మాంస భక్షణంబులచే మత్తెక్కి, జార, చోరకాది వృత్తుల యందు జాగిలమునోలె సంసరించు నీవా నన్ను పరిహసించునది; అధముడవైన నీకు విజృంభిత, గంభీర. గంగా మహోత్తుంగ తరంగ, నిర్ఘరిణివంటి ఆంధ్ర భాషావటిమ, ఏమి తెలియునురా? చెవిటివాని ముందు శంఖమూదిన వగిది, నిరక్షర కుక్షివైన నీకు నా పాండిత్య ప్రతిభా విశేషంబులు ఏమి తెలియును? జనకా! ఇప్పటికైనను చైతన్యవంతుడవై యీ దుష్ప్రేరణంబును వీడి, గృహాభిముఖుండవు కమ్ము. అచ్చట నీ కై నా మాతృమూర్తి సంతప్తదుఃఖ సాగరంబునంబడి కంటికి మింటికి ఏకధారగా విలపించుచున్నదే, యిట్టి అధమాధములంజేరి నిర్లజ్జితుండవై, యిట్టి నీచ కార్యంబు లొనరింప నీకు తగునా?

వెం:– [కోపమొచ్చి లాగి చెంపమీద కొట్టాడు] నోర్ముయ్. దరిద్రపు వెధవ, పని పాట లేకుండా మూడ్పొద్దులాతినే తిరిగేది చాలక, వెధవ నాటకాల సోదంతా ఇక్కడే ఎకరువు పెడతావ్?

పోల:- [ఏడుపు మొహం పెట్టి] ఇంటికిరా ! అమ్మతో చెప్పి నీ సంగతి తేలుస్తాను, కొడకా. [కోపంగా] పరభవ హ్వాద యాగ్ని జ్వాలాదందహ్యా మానసుండ [నాలిక కొరుకు కొని] ఆ కాంతయ్య మోసం చేసి పారిపోతుంటే, అమ్మ తెలుసుకొని.. ఆ విషయం మీకు చెప్పిరమ్మంటే నేనొస్తే చేతికొచ్చినట్లు చెంపమీద కొడతా !

గం:- మోసమా ?

పాప:-నాకు తెలియక డుగుతాను! కాంతయ్య పారిపోతున్నాడా?

వెం:- నా సామిరంగా, ఆ కాంతయ్య కళ్ళల్లో కారం కొట్టాడంట.

ము:- చెప్పరా నాయనా, అసలేం జరిగిందిరా ? అమ్మ ఏం చెప్పింది ?

పోల:- ఏదో చెప్పింది. ఇక నేను చెప్పను.

ము:- చెప్పవూ ?

పోల:- చెప్పను. నన్నెందుకు కొట్టావ్ ?

ము:- మాదర్చోద ! అసలు సంగతి చెప్పరా అంటే.

[కొట్ట బోయాడు. గంగయ్య అడ్డం వచ్చాడు]

గం:- నువ్వుండవయ్యా ! ఏం నాయనా, యిటురా [ప్రక్కకు తీసుకెళ్తాడు]

పండిందిరా పాపం. మీ - గుండెల్లో మోగింది తాం. తాం.
గాలి మేడలు కూలి - కలిసి పోయెను ధూళి;
కడుపేద కన్నీరు - బెడసి కొట్టెను మిమ్ము పండింది.
గర్వాన పొంగారు - క్రాలిరిగి కుంగారు
రచ్చలో మీ బ్రతుకు - మచ్చమాసిపోవు. పండింది.

గం:- నాతో చెప్పూ. [పోలయ్య, గంగయ్య చెవిలో ఏదో

చెప్తాడు] అలాగా ! అంతజరిగిందన్నమాట[ఆడుర్దాగా] ఏమండోయ్ ! కొంప మునిగింది రండి... రండి...

ము:- ఏమండీ ! ఏమిటి ?

గం:- చెప్తాలే రావయ్యా సోది ! రా రా వెంకాయ్ రా. పరుగెత్తవయ్యా పాపయ్యా ! [గబా గబా అందరూ బయటికి వెళ్తారు]

(తెర)

—:...

## అంకెలబిందెలు

### మూడవ రంగం - రాత్రి సమయము

[పిచ్చివాడు చెట్టుదగ్గర కూర్చొని తత్వం పాడుతూవుంటాడు]

ఈ తత్వమేమయ్యా రామయ్యా !
ఎటుకి చెప్పవయ్యా రామయ్యా !

విత్తునాటేదొకడు – పళ్లు కోసేదొకడు
కష్టించు వాడొకడు – కాజేయు నింకొకడు  ఈ. త్వ
నోరు లేనీవాడు – ఊరొదలి పోతాడు
దాకికొట్టేవాడు –ఊరేలు తున్నాడు  ఈ. త్వ
ఈ తిరుగుడేమయ్యా – రామయ్య
ఇంత తిరకాసేమి – రామయ్య  ఈ. త్వ.

ఎవరు త్రవ్విన గొయ్యి – వారికే మిగిలేను
ఎవరి పాపం వారికే – వెంట తగిలేను ఈ. త్వం.
ఆపదలు తొలిగించి – రామయ్యా
ఆలించి పాలించు – రామయ్య ఈ. త్వం.

[పాట అయిపోయేసరికి కాంతయ్యను తోసుకుంటూ తీసుకు వస్తారు. అదిచూచి పిచ్చివాడు చెట్టుచాటున దాక్కుంటాడు. కాంతయ్య, గంగయ్య, ముత్తయ్య, పావయ్య, వెంకడు ప్రవేశం]

వెం:– నా సామిరంగా! ఎగిరి తన్నానంటే ఎముకలు యిరిగి పోతయ్! పద సూపిద్దువుగాని.

ము:– మమ్మల్ని గాదని పారిపోతా? పోదువు గానిలే పద.

గం:– ఈ వేళ నీ అంతు తేలుస్తాం?

పా:– అంతేమిటండీ! నాకు తెలియకడుగుతాను, పన్నెండు జన్మలకుకూడా పత్తా దొరక్కూడదు.

కాం:– వదిలి పెట్టండి? మీరు మనుష్యులా. రాక్షసులా, దేనికీ బలవంతం?

వెం:– దొరల సొమ్ము తేరగా వచ్చిందని, నా సామిరంగా, దోచుకు పారిపోతా.

పా:– నాకు తెలియకడుగుతాను, ఈ పావయ్యకే పాచిక వేస్తావ్.

ము:– ఓకేయ్! ఈ ముత్తయ్యనే ముంచుతావట్రా నువ్వు!

గం:– ఇంతెందుకు ఈ గంగయ్యకే పంగనామాలు పెడదా మనుకుంటే! కాంతయ్యా చెప్పు!

ము:– చెప్పకపోతే చర్మం వొలిచేస్తాం. ఊం....!

కాం:– చెప్పాలా? ఏమిటి? చెప్పేది?

వెం:- వేందా ! నా సామిరంగా, నువ్వు పూజ్జేసింది.

పా:- నాకు తెలియకడుగుతాను, ఆ లక్ష్మి ఎక్కడుంది ?

కాం:- లక్ష్మి. లక్ష్మి ఇక్కడెందుకుంటుంది. ఆ వైకుంఠంలో వుంటుంది.

ము త్త:- ఇదిగో, మాకు కోపం పెచ్చుపెరిగిందంటే నివ్వు నరకంలో ఉంటావ్, తెలుసా?

గం:- మేము ఆమాత్రం బుద్ధిలేనివాళ్ళం అనుకుంటున్నావేమో? ఈ పప్పులు మనదగ్గర ఉడకవు చెబుతున్నా, నిజంచెప్పు!

కాం:- ఏ నిజం?

పా:- అదేనయ్యా! ఇక్కడ నిక్షేపం ఉందన్నావే, అది నిజంగా చూశావ?

కాం:- నేను నిక్షేపంవుందని మీకుచేను అమ్మానేడే ? మీరే కావాలన్నారు. బలవంతం చేశారు. హింస పెట్టారు. నా భూమి నేనమ్మనంటున్నా, డబ్బు నాముఖాన పారవేసి, దౌర్జన్యంగా నా భూమివి స్వాధీనము వ్రాయించుకొన్నారు. ఇందులో నేచేసిన తప్పేమిటో చెప్పండి? ఊరికి వెళ్తున్న నన్ను దారిలో పట్టుకొని, రెక్కలు విరిచికట్టి. ఇష్టమొచ్చినట్లు కొడతారా ! కొట్టండి చంపండి. యిలా మాటి మాటికి చిత్రహింసలు పడేకంటే, ఒక్కసారే మరణించడం మేలు. అధికారబలం, ధనబలంవుందని ఇంత దారుణానికి దిగుతారా ? దిగండి. నన్ను కొట్టినా, చంపినా నా నుంచి మీరు వినేదేమిలేదు !

ము:- లేదూ ? ఇలా ఎంతమందిని మోసగించి డబ్బు కాజేస్తావురా ? బందిపోటు వెధవా ?

కాం:- బందిపోటు ఎవరుచేస్తున్నారు? పేదవాళ్ళ భూమిని రాజకీయ బాధితుడు పేరుతో కాజేసి, బందిపోటు చేస్తుం దెవరు? "పంచాయితీ పెద్దల" మని ప్రజల సొమ్ము దిగ మ్రింగిన దెవరు? కన్నతల్లి వంటి పినతల్లిని చంపి, ఆ స్త్రిని అపహరించిందెవరు? గ్రామంలో కక్షలు పెంచి, దొమ్మీలు,దోపిడీలు, చేయించి, గడ్డివాములు, వరికుప్పలు తగుల బెట్టించిందెవరు? మీ స్వార్థం కోసం మీరు చేయని రాక్షసకృత్యం; మీరు జరుపని హత్యాచారం; మీరు గావించని దుర్మార్గం మేముంది? ఎనిమిది సంవత్స రాలనుండి బంగారం పండే నా భూమిని ఇద్దరూ చెరో వైపున రాబందుల్లాగా చేరి, చిట్టెడుగింజలు, పిడికెడు వరకలు పండకుండా జేశారు; మీ కంటే గ్రామాన్ని, రైతుల్ని బంది పోటు చేస్తున్న వారెవరు?

గం:- [బాగా కోపం వచ్చి] నోర్మూయ్! [గట్టిగా కొట్టాడు]

ము:- నీ అంత్యకాలం సమీపించింది. అందుకే మాతో విరో ధము తెచ్చి పెట్టుకున్నావ్?

పిచ్చి - [నవ్వుతూ ప్రవేశం] "నరజాతి చరిత్ర సమస్తం, పర పీడన పరాయణత్వం"! కొట్టండి, పూడ్చిపెట్టండి, బలవం తులతో విరోధం బ్రతుక్కే ప్రమాదం తెలిసిందా? ఈ పద్మవ్యూహంలో నుండి తప్పించుకొని వచ్చినా పోలేవు. దాస్తావెందుకు రహస్యం! నీకు తగిన శాస్తే జరిగింది. పులితో సరసమేమిటి! పాముతో చెలగాటమేమిటి? వీళ్ళు బస్మాసురులు, నరకాసులు, తారకాసురులు; ఏడుస్తా వెందుకు? దిక్కు లేదనా? .. నేనున్నానుగా! నేనంటే యెవరో తెలుసా? విష్ణుమూర్తిని, జిష్ణుమూర్తిని, కాదు!

కాదు ! ఈ సర్పవ్యాఘ్రాలు నాలుకలు చీలికలు చేసే కుమారస్వామిని.

ము:- నోర్ముయ్ ! [కొట్టాడు]

పిచ్చి:- [భయపడి కూర్చున్నాడు]

కాం:- పాపిష్ఠుడా ! దేనికా పిచ్చివాణ్ణి కొడతావు, అతనేం చేశాడని ?

గం:- కొడతామా ? కోస్తామా ?

వెం:- నా సామిరంగా ! రోలొచ్చి మద్దెలతో మొరచెప్పుకుందట !

పా:- తెల్పుకోండయ్యా ! నాకు తెలియకడుగుతాను ! తెల్లవారిపోతుంది ?

గం:- చెప్తావా ? లేదా ?

ము:- అన్యాయంగా చస్తావు ? ఆ ఆచూకి చెప్పు ?

వెం:- నా సామిరంగా ! మంచిగా అడుగుతుంటే మా నెక్కి కూర్చున్నావేంది ? [కొట్టబోతు] ఎక్కడి దెబ్బ పడిందంటే [పైకి కర్రెత్తుతాడు]

పా:- నువ్వుండరా ? ఏం కాంతయ్యా ! నీ డబ్బు నువ్వు తీసుకున్నావు. నాకు తెలియకడుగుతాను ! ఆ నిక్షేపం ఎక్కడుంది ?

కాం:- (నవ్వి) నిక్షేపమా ? మీకేమన్నా మతి పోయిందా? (కాంతయ్య, పిచ్చివాడు నవ్వుతారు)

పిచ్చి:- నిక్షేపం కోసం బయల్దేరారా ? భలే ! భలే ! భూమిమ్మీదున్న ఆస్తులు అర్థాలూ చాల్లేదన్నమాట. అప్పన్నే పాపాని కంత్రేముంది ? (నవ్వి) నిక్షేపం దాస్తావా ఇచ్చేయ్, వాళ్ళు రాజులు, భోజులు, తరాజులు ; వాళ్ళు

పెట్టేవాళ్ళు మొట్టేవాళ్లు. [కోపంగా] మీకేమన్నా మతిపోయిందా? పేదవాడి దగ్గర పెన్నిధు లెందుకుంట య్‌రా పెద్దమ్మల్లార?

ఉన్న దున్నాడంటు ఊరంత తిరిగేవు
కన్ను దెరిచి చూడు మనసా.,
కన్ను దెరిచి చూస్తే కల్లాయె మీ బతుకు మనసా.,

గం:- ఒరే! వెంకా యీపిచ్చివాణ్ణి రెండుతన్ని బయటికీడ్చరా?

వెం:- పదరా! పిచ్చినాయాల! [పిచ్చివాడిని బయటకి లాక్కెళతాడు]

కాం:- ఊర్కోండి? అతన్నేమి అనకండి? మీరు మను ష్యులుకారు! పిచ్చివాడి మీదనా మీ ప్రతాపం?

ము:- ఈ పిచ్చివాగుడు మాని ఆ నిక్షేపం ఎక్కడుందో చెప్పు. లేకపోతే ఈ నాటితోనే నీ ఆయుర్దాయం మూడిందే.

కాం:- మీరు తిట్టినా, కొట్టినా నేనేం చేయగలను. అసలు నాకా సంగతి తెలిస్తేగద?

గం:- తెలియదూ? (కొట్టాడు) డొక్క చీలుస్తా?

కాం:- ఊ హు! తెలియదు. మీరు యేంచేసినా అంతే... నాకు తెలియదు.

పా:- నాకు తెలియకడుగుతాను! ఏమీ తెలియకపోతే ఆ లంకెల బిందెల కోసం మూడు మాసాలనుండి దేనికి పడుకున్నావ్?

కాం:- నేనా?

పా:- అహా...! నువ్వుకాదు...నేను. [వెంకడు వచ్చాడు]

ము:- ఇంతకూ లేదంటావ్?

వెం:- అట్టా చెపుతాడా? నా సామిరంగా! ఆ కత్తి ఇట్టా

యిూయండి దొరా (ముత్తయ్యగారి చేతిలో నున్న కర్ర కత్తిలోంచి పిడిపట్టుకొని ముత్తయ్య అందించగా లాగుతాడు)

పా.- మనిషిని చంపితే మర్మం తెలుస్తుందా ? నాకు తెలియకడుగుతాను ! ఇదంతా ఎందుకు కాంతయ్యా ! నీ భూమిని నీవు తీసుకో ! లేదా ? నీకు ఆ లంకెల బిందెల్లో బాగం పెడతాం ? యేమంటావ్ ? మహాదేవి (శ్రీ) లక్ష్మిని పైకి తీయటానికి ఉపాయం చెప్పు. నలుగురితో పాటు నువ్వూ లాభపడతావు !

కాం;- పాపయ్యా ! నేను నీ వంటి దుష్టుణ్ణికాను ! దురాశతో దుఃఖాన్ని కొని తెచ్చుకొనుటకు, ధనం కోసం సిగ్గూ ఎగ్గూమాని చీమూ, నెత్తురు చంపుకొని, జీవించే తుచ్ఛుణ్ణి కాను. నీ వంటి ఛీడపురుగును గాను, ఇప్పటికైనా ఒక విషయం గ్రహించు. నీ మాయ మాటలకు మోసపోయేవాణ్ణి కాను. నీ టక్కరి మాటలకు చిక్కుల్లో పడిపోయేవాణ్ణి కాను. నీ వంచన నాకు తెలియందికాదు'

పిచ్చి:- [వచ్చాడు] నీకూ తెలుసూ ! అయితే తెలిసి కూడా చిక్కుల్లో పడ్డావేం ! (విచారంగా) అయ్యో చంపుతారూ చంపుతారూ ! వీళ్ళు రాక్షసులు, రా పోదాం రా ! ఇదంతా నరకం ! యమ లోకం !

కాం:- అవును ! ఇదంతా నరకం నాయినా ! ఈ నరకంలోని దారుణ హింసాకాండలను, చూసే దేవతలు లేరా ! నీవయినా వెళ్ళి ఆ దేవతలతో చెప్పునాయినా ?

పా:- చెపుతాడులే ! నాకు తెలియకడుగుతాను ! నీ అర్థాలు తెలియని మూర్ఖులంకామా. ఒరే వెంకా, ఇలారా ?

[పాపయ్య వెంకడి చెవిలో ఏదో చెప్తాడు]

పిచ్చి:-అన్నా యీ నరకంలో... అంతటహా దారుణ హింసా కన్నారా చూచారా . మనసారా యేడ్చేదా,

కాం:- [బాధగా] రంగా !

పా:- రంగా ! [నవ్వి] ఎవరీ రంగడు ?

కాం:- ఎవరా ? రంగడు. నా పాండురంగడు !

పా:- పాండురంగడా ? [ఆశ్చర్యంతో చూస్తూవుంటాడు]

కాం:- ఎన్నాళ్ళయ్యా, ఈ నరకం ! ఈ దానవ హింసలు భరించి, భరించి, నా గుండెలు చివికి పోయాయి. నా మనస్సు క్షోభించింది. ఈ చిత్రహింసలు, ఈ క్రూరమైన బాధలు, ఈ దీనాలాపం. ఎవరింటారయ్యా. నిరపరాధుల్ని పట్టుకొని, నానా చెఱలు పెడుతున్నారు! వెళ్ళు ! బాబూ వెళ్ళు ! వెళ్ళి, నా దీనాలాపం ఆ దేవతలతో చెప్పు.

పా:- [నవ్వి] చెపుతాడు ? నాకు తెలియకడుగుతాను ! గం గయ్యగారు ! ఇలారండి ! [గంగయ్య] వచ్చాడు. ఆశ్చ ర్యంగా పాపయ్య, గంగయ్య చెవిలో ఏదో చెప్పాడు. గంగయ్య నివ్వెరపడి ఒక్షణం ! కాంతయ్యను పిచ్చివాణ్ణి చూశాడు. వెంకడికి కన్ను గీటాడు]

వెం:- నా సామిరంగా ! భలే వుపాయం ! చెప్పావే ! యీ దెబ్బతో లంకెల బిందెలు వుంటే పైకి రావాల [చప్పున వెళ్ళి పిచ్చివాడుఅనుకున్నా లోపలకు లాక్కెళ్ళబోతాడు]

ము:- బలే ! ఆలోచన చేశావయ్యా ?

గం:- ఇప్పుడు గాని కాంతయ్యను పిచ్చివాడు కావాలో ! డబ్బుకావాలో తేల్చుకోడం! ఊ కానివ్వరా ! కానివ్వు ?

పిచ్చి:- [ఏడ్చాడు భయంగా] అమ్మో !

వెం:- నా సామిరంగా ! యింకానూత్తారేంది ? శరణగోరూ ! రండి గోతి దగ్గరకు పోదాం ! [వెంకడు పిచ్చివాడిని లోనికి లాక్కెళ్ళాడు, పాపయ్యా వెళ్ళాడు. ముత్తయ్య,గంగయ్య పెద్దగా నవ్వారు. పిచ్చివాడు పెద్దగా యేడ్చాడు]

పిచ్చి:-చంపుతున్నారు ! చంపుతున్నారు ! అమ్మో ! బాబో!

కాం:- ఆపండి ! ఆపండి ! హింసాకాండను ! మీకు పుణ్యముంటుంది.

ము:- పిచ్చివాడా ! పుణ్యం ఎవరికి కావాలి ! డబ్బు ! డబ్బు కావాలి ! చెప్పు ! యిప్పుడన్నా నిజం చెప్పు ! ఆ నిక్షేపం యిక్కడ వున్నట్టేనా ?

గం:- మించి పోయినాక విచారించి లాభం లేదు,ఏమంటావ్

కాం:- చెపుతాను, విడిచి పెట్టండి!

ము:- ఒరేః వెంకా ! ఆపరా ! ఆపు.

కాం:- ఆపటంకాదు ! బయటికి తీసుకరండిః చెపుతాను.

గం:- పాపయ్యగారూ ! పిచ్చివాడిని బయటకు తీసుక రండి ! [వెంకడు, పిచ్చివాడు. పాపయ్య బయటికి వస్తారు]

కాం:- కట్లు వూడదీయండి, చెపుతాను ? [ముత్తయ్య, కాంతయ్య కట్లు ఊడదీయమని వెంకడికి సైగ చేస్తాడు. వెంకడు వూడదీస్తాడు కాంతయ్య పిచ్చివాణ్ణి కౌగలించుకుంటాడు. పిచ్చివాడు యేడుస్తూ కౌగలించుకుంటాడు. కాంతయ్య తల నిమురుతూ]

కాం:- ఊరోకో బాబూ, ఊరోకో. నేనున్నానుగా.

ము:- ఈ ఓదార్పులుతోనే తెల్లవారుస్తావా ? చెప్తావా ?

వెం:- ఇదంతా మరొక ఎత్తేమో, నా సామిరంగా, బిత్తర వేశావో. చిత్తైపోతావు.

పా:- నాకు తెలియకడుగుతాను, నువ్వుండరా, మనల్ని తప్పించుకొని ఎక్కడికిపోతాడు.

గం:- ఊఁ... చెప్పవయ్యా, జాగుచేస్తావేమిటి ?

కాం:- [గంభీరంగా] చెపుతున్నాను, జాగ్రత్తగా వినండి ! మీలో ఏ వక్కరూ పరధ్యానంగా వుండరాదు. మీవంటి బుద్ధిహీనులకు [అంతా ఒకళ్లు ముఖం ఒకరు చూసుకుంటూ ] ధన కాంక్షతో తెగించి ... హత్యాచారాలకు నీచ కృత్యాలకు దిగే పాపఖర్మలకు [అందరికీ కోపం, వచ్చింది] నాకు తెలుసు మీకు కోపం వస్తుందని. అయినా డబ్బుకోసం, నీచత్వానికి అలవాటుపడిన మీకిదేమంత పెద్ద విషయం కాదు మీలో ఒకళ్ళకే ఆ రహస్యం చెపుతాను

అందరు;- అందరికీ చెప్పాలి ?

కాం:- చెప్పను. [అంతా కోపం నటించారు] చెప్పక తీర దంటే చెప్తాను. యిలారండి ! [అందర్నీ లోనికి తీసుకెళ్తాడు ఇదిగో ఇక్కడే ... అంతా చూడండి. ఇక్కడే ఆ నిక్షేపం వుంది. [అంతా పరిశీలించి చూస్తారు. పిచ్చివాణ్ణి పారిపొమ్మని సైగజేస్తాడు. పిచ్చివాడు పారిపోతాడు అది వాళ్ళు గమనించరు. కాంతయ్య సంతోషంగా] ఏం చూశారు ?

గం:- ఏముంది చూట్టానికి ? నాకేమీ కనుపించటం లేదు. [ముత్తయ్య నుద్దేశించి] మరి మీకో ?

ము:- అబ్బే ? [వెంకడిని ఉద్దేసించి] మరి నీకురా వెంకా ?

వెం:- నేనంత గుడ్డి నాయాల్ని కాదండీ !

పా:- అదికాదురా దౌర్భాగ్యుడా ! అసలు నీకు నిక్షేపం కనిపించిందా అని.

వెం:- నాకెందుకు కనిపిచ్చిందండీ ? అసలు ఉండి ఏడిస్తేనా ?

కాం:- అవును మీకు చూపుతోపాటు బుద్ధి, బుద్ధితోపాటు మానత్వం నశించి పోయాయి. ధనదాహంతో పేదవాళ్ళని పీక్క తినాలని ... ఈ ప్రపంచాన్ని పంచుకొని ఊరేగాలని ప్రయత్నిస్తున్నారు [అందరూ కోపంగా వుంటారు] అవును నేనంటున్న మాటలు మీకు కోపం తెప్పిస్తాయి. దుస్సహమైన ఈ బాధకన్నా. ఈ నిక్షేపంచాలా గొప్పది] ఇప్పుడు చెప్పండీ. మీరేం చూశారు.

గం:- పాడుసోది వదిలి ఆ నిధి ఎక్కడుందో నిజంచెప్పవయ్యా?

పా:- నాకు తెలియకడుగుతాను! నీవు చెప్పేదానికన్నా చివాట్లు ఎక్కువ వేస్తున్నావ్ ?

వెం:- నా సామిరంగా! సందుదొరికిందని తెగతిడ్తున్నాడండీ

కాం:- నోర్ముయ్. నేను చెప్పేదివిను. ఒకనాడు . అర్ధరాత్రి నిండు అమావాస్యరోజు .. కన్నుపొడుచుకున్నా కనిపించని చీకట్లో... కళ్లు మిరుమిట్లు గొలిపే బంగారు ఛాయలతో ధగధగా మెఱుస్తూ తొలకరి మెరుపులా రెండు... రెండు పెద్ద అరివేణీ బానలంత బిందెలు పైకొచ్చాయి. నా కళ్ళను నేను నమ్మలేక పోయాను. నాకు మతిపోయింది.

ము:- అవును! అవి చూస్తే ఎవరికైనా మతి పోతుంది.

కాం:- అప్పుడు నా స్థితిలో మీరే వుంటే నెత్తురు కక్కు చచ్చేవాళ్ళు.

గం:- అవును. ఆ లక్ష్మీస్వరూపమే అంత భయంకరమైంది. మేమేకాదు. ఎరరైనా చస్తారు.

కాం:- వినండి! ఆ బిందెలు ధైర్యంచేసి పట్టుకోబోయాను, కానీ అవి చిక్కలేదు.

పా:- నాకు తెలియకడుగుతాను? అంత తేలిగ్గా చిక్కుతయ్యె టోయ్? పిచ్చివాడా!

వెం:- నా సామిరంగా! ఆకలిగొన్న పులిలా అందుకో బోయి నట్టున్నాడు. యిట్టాంటి వాళ్ళకేనా అవి చిక్కేది (నవ్వాడు)

ము:- నీ నవ్వు పాడుగాను, నువ్వూర్కోని చావరా.

గం:- వాడెందుకు వూరుకుంటాడండీ? అడ్డుపుల్లలు వేస్తూనే వుంటాడు. నువ్వు చెప్పవయ్యా.

కాం:- ఆరోజునుండి ప్రతినిత్యమూ కనిపించేది. నాకు అవి దక్కించు కోవాలని ఆలోచన పుట్టింది, కానీ .. అవి...
[ఆగాడు]

అందరూ;- అవి యేమయ్యాయ్?

కాం - అదే చెప్పాస్తున్నాను. అవి నరబలి కోరాయి.

పా;- నే చెప్పలేదండీ! నరబలి లేకుండా ఆ నిక్షేపం బయటికి రాదని.

వెం:- నా సామిరంగా! కరణపాయనకు తెలియనివి కలి యుగంలోనే వుండవు. కరణంగోరి మాట మా కరట్టండీ!

కాం:- నేను చాలా రోజులుగా చేస్తున్న లక్ష్మీపూజ ఫలిం చింది. నా జన్మ తరించినట్లయింది. నాలో ఏనుగంత బలం ప్రవేశించి నట్లయింది. నా కన్నుల్లో ఆనంద జ్యోతులు మెరిశాయి. నేనా దివ్యమంగళవిగ్రహం ముందు మోకరిల్లి శత నమస్కారాలు చేశాను. అప్పుడా లక్ష్మీ దేవికి నాపైన జాలికలిగిందనుకున్నాను. నా వెన్నుతట్టి పిలిచినట్లయింది. ఆ మధుర కంఠంనుండి నాకు కొన్ని

మాటలు విన పడ్డాయి. "కాంతయ్యా, నీ భక్తికి, శక్తికి మెచ్చాను, నీవు ఒక్కపని చేస్తే నీ అదృష్టం ఫలిస్తుంది. నీ ఆత్మీయులలో ఒకరిని బలియిస్తే నీ చేతికి దొరుకుతాను. లేనిచో ఫలితం శూన్యం" అని, అప్పుడు ఎడతెగని ఆలోచన చేశాను. "నా ఆత్మీయుడు ఎవరున్నారు ?" అని. నా వంశాంకురమైన ఒక్క గాని ఒక్క మనుమడున్నాడు, పసివాడు. ఒక్కగాని ఒక్కడు, నా బ్రతుకంతా వాని కొఱకే నా కళ్ళన్నీ వాడిమీదే. అట్టి పసికందును, నా చిరంజీవిని నా చేతులారా ఎట్లా ? [కన్నీళ్ళు తుడుచుకొన్నాడు]

పా:- అట్లాగంటే ఎట్లా ? నాకు తెలియకడుగుతాను? ఆ ధనలక్ష్మి, ఆ శ్రీలక్ష్మి త్యాగం చేసిన వాడికిగాని భోగభాగ్యాల నివ్వదుమరి ?

కాం:- నిజంగా ఆరోజు బాగా ఆలోచించాను, ఈ బ్రతుకంతా దరిద్రంతో మగ్గిపోవటమా ? ఏ పాపమెఱుగని ఆ పసి బాలుని బలియిచ్చి పసిడి పాతరను స్వాధీనం చేసుకోవడమా అని ? ఒకవంక ధనం, మరొక వంక మనుమడు స్వర్గనరకాలూ నాముందు నిలచాయి. మానవుడు క్షుద్రమైన దరిద్రంలో బాధు(ప్రే)మ, పుత్రప్రేమ పాపపుణ్యాలూ గ్రహించడని కాని యీ పాడు ప్రపంచంలో డబ్బుకన్నా పుణ్యమైనది, ప్రేమపూరితమైనది. ఆత్మీయమైనది మరొకటి లేదని గ్రహించాను.

ము:- ఇంతకాలానికి జీవిత పరమార్థాన్ని గ్రహించావన్న మాట.

కాం:- ఓ మెట్టు క్రిందకు దిగిపోయాను, క్షణకాలం నాకు

మనుమడు పుట్టలేదే అనుకున్నాను. నాకు దుఃఖమాగింది కాదు

గం:- చివరకు మనుమడిని నరుకు కోవాలని అనుకున్నా వన్న మాట ?

కాం:- అవును, కాని యింతలో ఎలాగో మీ అందరకు తెలిసి పోయింది విషయం. మీ రంతా వచ్చిపడి నా మార్గాన్ని నిరోధించి, నన్ను అదృష్టహీనుణ్ణి చేసి నన్ను బయటికి గెంటారు. ఏం చేయను. తినే రాత లేదనుకున్నాను,

ము:- ఆఁ ... తరవాత ?

కాం:- తరువాత ఏముంది? మీలో ఎవరైనా చావటానికి ఒప్పుకుంటే ? [అంతా ఒకరి మొఖాలు ఒకరు చూసుకొన్నారు] నాకు తెలుసు, మీరు మాత్రం చావటానికి ఒప్పుకోరు. కాని ఎవరైనా చావటానికి మాత్రం వెనుకాడను, మీకు యితర్లను చంపడమున్నా, వాళ్ళను దోచుకు తినడమున్నా గొప్పవిషయం కాదు. ప్రతి ఫలాన్ని కాంక్షించే వారు ప్రాణత్యాగానికి కూడా వెఱువకూడదు. ఏమంటారు? ... మీలో ఒక్కళ్ళు చావటానికి అంగీకరిస్తే ఆ నిక్షేపాన్ని నిముషంలో బయటికి తీస్తాను. యేమంటారు ? చచ్చే వాళ్ళు ముందుకు రండి ! [అందరూ మొఖాలు పాలిపోయి యేడవలేక నవ్వుతారు]

వెం:- నా సామిరంగా ! మనమెందుకు చావాల్నంట ? ఎవరి నైనా.. [ఇందాకటివి గుర్తుకొచ్చి నాలుక కరచుకుంటాడు

పా:- నాకు తెలియకడుగుతాను, నువ్వెందుకురా మధ్యలో, డబ్బుపెట్టుకొన్నారుగా, ముత్తయ్యగారొక్క, గంగయ్య

గారో్న చెప్పనివ్వ !

ము;- నేనుమాత్రం యేమిచెప్పేది. అది గంగయ్య గారే చెప్పాలి.

గం;- నాకు యిలాంటి వాటిల్లో ప్రవేశం లేదు.

కాం:- త్వరగా చెప్పండి. తెల్లవారి పోతుంది. మీలో ఎవరైనా తతిమ్మాముగ్గురుకోసం ప్రాణత్యాగం చేయలేరూ

ము:- [పలకడు]

గం:- [అయిష్టంగా చూచాడు]

వెం.- [మాట్లాడబోయి కరణాన్ని చూచి ఆగాడు]

కాం:- నువ్వేమంటావ్ పాపయ్యా. మరి నువ్వైనా ?

పా:- నేనా ?... నాకేమీ వద్దు.

కాం:- అవును, మీరెవరూ చావరు. మీ బ్రతుకులంతే మీకు చాలాతీపి, సుఖపడాలనే ఆశ, భోగభాగ్యాలలో తులతూగాలనే కాంక్ష, గొప్ప కుబేర్లు కావాలనే పేరాశ కాని, మీవంటి బ్రతుకులే యీ పేదరైతులవని తలచరు. కుబేరుడు కానక్కరలేదు, ఒక్కపూట... ఒక్కపూట చేలో పంట తినని స్తే చాలు ఆ... చెపుతున్నానువినండి

ము;- పోనీ ఎవరినన్నా తెచ్చి బలియిస్తే [ఆలోచనగా ఆగాడు] పిచ్చివాడా, ఏదోవిధంగా సుఖపడ్డానికి గాని, దుఃఖపడ్డానికా ?

గం:- అదీ మంచి వుపాయమే.

వెం:- నా సామిరంగా. నన్ను తెమ్మంటే ? ... [కరణాన్ని చూచి ఆగాడు]

పా:- బ్రతికుంటే బలుసాకు తినొచ్చు. మాలో ఎవరమూ చావము నీ చేతనైతే మరోవిధంగా ...

కాం:- [కాస్త ఆలోచించి] సరే, అలాగే చేద్దాం, ముత్తయ్యా గారూ, మీరు యిలా రండి. [ముత్తయ్య వెళ్ళాడు. కాంతయ్య రహస్యంగా చెవిలో ఏదో చెప్పాడు, ముత్తయ్య నవ్వుతూ వెంకడిని చూశాడు వెంకడు ఆ చూపులకు భయపడ్డాడు. ముత్తయ్య దగ్గరకువచ్చి వెంకడు భుజం మీద చెయ్యివేసి తట్టాడు, వెంకడు వణికిపోయాడు]

ము:- గంగయ్యా గారూ, యిలా రండి.

గం:- నన్నా ! [వెళ్ళాడు]

వెం:- [భీతిగా పాపయ్య వంక చూశాడు. పాపయ్య అర్థంగాక చూచాడు ముత్తయ్య గంగయ్య చెవిలో ఏదో చెప్పాడు గంగయ్య చిరునవ్వుతో పాపయ్యవంక చూచాడు. పాపయ్య వెల వెల బోయాడు. వెంకడు బ్రతుకు జీవుడా అను కున్నాడు. గంగయ్య వచ్చి పాపయ్యను తీక్షణంగాచూచి భుజంమీద తట్టి, వెంకడికి కరణాన్ని పట్టుకోమని సైగ చేస్తాడు. వెంకడు పాపయ్య మీదకు పోతాడు. కరణం చావు తప్పదన్నట్లు గంగయ్య కాళ్ళు చప్పున-పట్టు కొంటాడు]

కాం:- ఏమండీ కరణంగారూ ! [చిరునవ్వు గర్వంగా నవ్వు తాడు]

పా:- అయ్యా ! పాపం జాన్నణ్ణి ! నన్ను రక్షించండి ! (అంతా కలసి నవ్వుతారు పాపయ్య మరింత బిత్తర పోయాడు. యేడుపు ముఖంపెట్టి కాంతయ్య కాళ్ళమీద పడ్డాడు) కాంతయ్యా ! కాంతయ్యా ! పిల్లలు కలవాణ్ణి పిల్లలు కలవాణ్ణి ... నన్ను ... నన్ను రక్షించండి !

కాం:- ఛీ! ఛీ !.. పాడుప్రాణం కోసం ఏడుస్తావేం పాపయ్యా!

ఒకవేళ నువ్వు లేవనుకో? నీ కుటుంబాన్ని మేము కాపాడం? ఏమంటారు గంగయ్య గారూ!

గం.– [అవునన్నట్లుగా ముత్తయ్యను చూచి నవ్వాడు]

కాం:– ముత్తయ్య గారు! సందేహిస్తున్నట్లున్నది.

ము:– నాకా? నాకేమీ లేదే!

కాం;– వెంకాయ్, నీ కత్తికి పదును బెట్టరా, పాపయ్య పారిపోతాడేమో జాగ్రత్తగా వుండాలంతా.

పా:– అయ్యా! అయ్యా! ముత్తయ్యగారూ ఇదేం అన్యాయం! నన్ను .. నన్ను బలియిస్తారా? మిమ్మల్ని నమ్మానే? మీ వెంట వుండి మీ కెన్నో ఉపకారాలు చేశానే? మీ కుటుంబాన్ని నిలబెట్టానే? నాకు చేయువలసిన ఉపకారం యిదేనా? మీ కాళ్ళు పట్టుకుంటాను. మిమ్మల్ని వేడుకుంటున్నాను. నాకు యీ దిక్కుమాలిన లంకెల బిందెల్లో భాగం అక్కర్లేదు. నన్ను రక్షించండి, నేను పిల్లలు గలవాణ్ణి [ఏడ్చాడు]

కాం;– అంతా పిల్లలు కలవాళ్ళేనయ్యా పాపయ్య! ఫరవా లేదులే నీ కుటుంబానికి అన్యాయం జరగదు.

పా:– బాబూ నాకొద్దు. ఈ పాపిష్టి డబ్బుకోసం నా ప్రాణం తీసుకోలేను. నన్నుపోనివ్వండి. ముత్తయ్యగారూ, మీరిలా చేయడం .

ము:– [అయిష్టంగా] నన్నేం చెయ్యమంటా?

పా;– అంతేనా, అంతేనా, గంగయ్యగారూ మీరన్నా రక్షించలేరూ!

గం; – నువ్వేగదయ్యా నరబలి లేకుండా నిక్షేపాలు పైకిరావని నా అల్లుణ్ణి చంపటానికి తెప్పించావ్, నేనేంచేయను.

మాకు కావలసింది నువ్వుగాదు ... లంకెల బిందెలు... అర్థమయిందా? [నవ్వాడు] లాక్కెళ్ళరా వెంకా.

వెం:- నా సామిరంగా, పాచికల పాపయ్యనో, పాచికల పాపయ్యనో అన్నావు కరణపాయన ఎత్తులు కానీ కొర్కర కాకుండా పోయినై. ఇప్పుడేడిత్తే లాభం అంట! నరబలి గావాలన్న మొగోడివి నువ్వేగా! నువ్వు తీసుకున్న గోతిలో నువ్వే పడ్డావు. యిక అనబగించు.

పా:- పడ్డాను. నా బుద్ధినంతా ఖర్చుపెట్టుకొని .. నన్ను గోతిలో కీడ్చి, నా వల్ల లాభాలు పొందిన యీ దుష్టులు ఈ వేళ నన్ను చంపుతారా? తల్లిపాలు త్రాగి రొమ్ములు కోసేరకం.

ము:- ఛీ! ఒరేయ్ వెంకా, యింకా నిలబడ్డావేరా కానివ్వు.

వెం:- రండికాంతయ్యగోరూ, పదపయ్యా పాపయ్యా మాదిగ ముండాకొడకా .. మాదిగ ముండాకొడకా అని నన్ను గాదు తిట్టడానికి... రా [లాగాడు]

పా:- అయ్యా! రక్షించరూ! రక్షించరూ! [కాళ్ల బడి యేడ్చాడు]

ము:- నిన్ను రక్షిస్తే నువ్వు మమ్మల్ని భక్షిస్తావ్. నువ్వు బ్రతికి నందువల్ల మాకు చాలాచిక్కులున్నాయి. నీమాట వినే యీ చేసుకొన్నాం ఒకటి నీ మాట వినే గంగయ్య గారి అల్లుణ్ణి చంపుకునేవాళ్ళం. రెండు నీవు బ్రతికుంటే ఎప్పుడైనా యీ లంకెల బిందెల సంగతి ప్రభుత్వానికి తెలియ పరుస్తావ్. నీ చేతిలో మా ఆయువు పట్లన్నీ వున్నయ్ అవి యే క్షణాన్నయినా బిగిస్తావ్ నిన్ను బ్రతి

కించి మేము చావలేము. అర్థమయిందా. [కాంతయ్యే నవ్వుతాడు]

గం:- ఇలాంటి మహత్తర సమయం ఎప్పుడువస్తుందాఅనినేను చూస్తున్నాను. నువ్వు నన్ను అనేకసార్లు అధికార్లకు అప్పగించాలని చూశావు. దొంగఘార్జరీలు పుట్టించి ... నీ వల్ల ఎన్నో బాధలు పడ్డాను ఎంతోధనం నష్టపోయాను నీవు బ్రతికి వుండటంవలన మాకు చాలా చేటు మూడు తుంది. కాంతయ్యకు ఆ లంకెల బిందెలున్న ప్రదేశంబాగా తెలుసు. నీ చావువల్ల మాకు, గ్రామంలో శత్రుబాధ తప్పడం, బోలెడంత ధనం చేతికి రావడం జరుగు తుంది, ఏం అర్థమయిందా? లాక్కెళ్ళరా వెంకా.

వెం:- నా సామిరంగా! తల తెగబోతుంటే! ఏం ఎనకా ముందు ఆలోచిస్తావ్? (బలవంతాన కరణాన్ని పట్టుకు వెళ్తుంటాడు)

కాం:- ఏం పాపయ్యాగారూ! యిక మీా పెద్దల్ని తలుసుకోండి. నీవు తెలివికల వాడివై యుండి, పూటకూటికి కక్కుర్తిపడి నీ ఆత్మను అమ్ముకొని, నీ విద్యను తగుల వేసుకొని, పేద వాళ్ళను యేడిపించి, ఈ పెద్ద మనుష్యులను గొప్పవాళ్ళను చేస్తే ఫలితం చూశావుగా, వెళ్ళు, వెళ్ళు అనుభవించు, ఒకనాడు నీవు చేసిన పాపాల్లే నీ గొంతుకు ఉరిత్రాళ్ళు అయినయ్యని తెలుసుకో!

ము:- తెల్లవారి పోతుంటే. యింకా తెల్ల ముఖం వేసుకు చూస్తావేరా ఊఁ లాక్కెళ్ళు!

కాం:- కాస్తాగండి! కత్తికి బాగా పదును వుందా వెంకా?

వెం:- నా సామిరంగా! ఒక్కేటుకు వంద తలకాయలు ఎగిరి

పడాల. చూాత్తారుగా మన తడాఖా.

కాం:- సరే ! తీసుకపద.

పా:- కాంతయ్యా ! కాంతయ్యా ! నీకు జాలిలేదా ? నీకూ దయ లేదా ? నన్ను చంపిస్తావా ? నా భార్య మంగళ సూత్రం తెంచుతావం ?

గం:- ఏమిటిరా ? యీ ఏడుపులూ, మొత్తుకోళ్ళూనూ, ఊc... లాక్కెళ్ళు.

వెం;- పదశా ! పద [నెట్టు కెళ్తుంటాడు]

పిచ్చి:- [నవ్వుతూ ప్రవేశించాడు] నీ పాపం పండింది ! నీ ఆయువూ మూడింది ! భలే ! భలే ! నమ్మినవాళ్ళ చేతుల్లో చస్తే, నరకం గాదోయ్ ! స్వర్గం ! స్వర్గం ! ఎదు రొస్తుందోయ్. ఊc వెళ్లు. యింకా నిలబడ్డావేం ? [నవ్వి]

ఎంగిలికూడూ కుడుచుట తప్పూ !
దొంగల స్నేహం ఎందుకు చెప్పూ ?
పెద్దలు పట్టిన తొలగదు ముప్పూ
చెప్పుకుంటివా నీకే సిగ్గూ !

గం.- నోర్మూయ్ ! పిచ్చివెధవా వెళ్ళవతలికి.

పిచ్చి:- (భయపడుతూ కరణం దగ్గరకు వెళతాడు)

ము:- అబ్బబ్బ ! ఏమిటీ ! వెధవ అడ్డంకులు ! ముందు యీ పిచ్చివాడి పని పడితేగాని పీడావదలదండీ ! వెంకా ఆ పిచ్చి గాడిదనుకూడా లాక్కుపద గోతి దగ్గరకు.

పిచ్చి:- [వెంకడు పిచ్చివాడి మీదకు వెళ్ళ బోతాడు, పిచ్చి వాడు పిస్టలుతీసి] ఆగు, మూర్ఖించి ముందు కొచ్చావా ? గుండెల్లోనుండి గుళ్ళు దూరతయ్ జాగ్రత్త.

ము:- ఆc... ఎవరునువ్వు ? [గర్జిస్తాడు]

(గంగయ్య, వెంకడు నిర్ఘాంత పోతారు. పాపయ్య నిట్టూ రుస్తాడు. కాంతయ్య నవ్వుతాడు)

పిచ్చి:- [హేళనగా నవ్వి] మీ పాలిట మృత్యు దేవుణ్ణి తెలిసిందా ?

వెం:- నా సామిరంగా! పిల్లెల్లే తిరుగుతూ పులెల్లే ఓరగ బడ్డావే !

ము.- ఎవడో మేకవన్నె తోడేలు.

గం:- అంతేగాదు పగబట్టిన నాగుబాము, కాంతయ్య ఎవడు వీడు ? ఏమిటి నాటకం ?

కాం:- నాటకం [హేళనగా నవ్వి] మీ జీవిత నాటకం.

పిచ్చి:- అర్థమైందా! అంతంగాబోతున్న మీజీవితనాటకంలో ఆరంభమైంది, చరమాంకం.

ము:- నోర్మూయ్ !

పిచ్చి:- మూస్తాను. నోర్మూయ్యటమేగాదు; మీ దారి కూడా మూయ్యటానికే వచ్చాను.

వెం:- వచ్చావా ? నా సామిరంగా అయితే చచ్చానే

గం:- పిచ్చివాడివని కనికరిస్తే రెచ్చి పోతున్నావ్ పిస్టలు అవతల పారేస్తావా పీక నొక్కమంటావా ? [మీాద కెళ్ళ బోతాడు]

పిచ్చి:- ఆగండి, అడుగు ముందుకు వేశారా? మీ అంత్యకాలం సమీపించిందే ? (విజిల్ వూదాడు) తుపాకీలతో చిన్న కాగితాల కట్టలతో యిద్దరు పోలీసులు వస్తారు. వాళ్ళని చూచి అదంరూ భయపడతారు)

ము:- మోసం ! అంతా మోసం !

పిచ్చి:- మోసం! ఏది మోసం !! ఎవరిది మోసం! ఆద

రించిన పితృతల్లిని ఆస్తికోసం హత్యచేయడం మోసంగాదు! హత్యానేరాన్ని ఆచూకీ తీయవచ్చిన పోలీసు ఆఫీసరుని లంచాలతో వంచించచూడడం మోసం గాదు ? మీ ధన పిశాచానికి దాసోహం చేయక, నీతికి నిలిచిన ఆ ఆఫీస రుని దొంగచాటుగా పట్టి నదిలో దొర్లించడం మోసం గాదూ ? యింక ఏది మోసం ? ఎవరిది మోసం ... పలకవేం ?

గం:- పిచ్చివాడిలా వెంటాడి మా రహస్యాన్ని రచ్చకీడుస్తున్న ఎవరు నువ్వు ?

పిచ్చి:- ఎవరినా ? గ్రామం ఉమ్మడి సొమ్ము పది సంవత్స రాలనుంచి పటికి బెల్లంలా తినేస్తూ, కష్టజీవుల్ని కాల రాస్తూ, దుష్టశక్తుల అధికారానికి ఆహుతి జేస్తూ, హత్యలూ, అరాచకాలతో గ్రామాన్ని దోపిడీలు చేస్తున్న మీ దుష్టద్వయాన్ని దాగిలో పెట్టటానికి పిచ్చివాడిలా అవతరించిన పోలీసు ఆఫీసరుని. పడి కల్లనాడు, మీరు చచ్చాడని సంతోషించిన ఆ పోలీసు ఆఫీసరే యీ పిచ్చి వాడు.

పా:- అయ్యా, రక్షించండి. [అమాంతంగా కాళ్ళమీద పడి] నా ఉద్యోగ ధర్మం తప్పి, ఈ నరహంతకుల చెప్పుచేతలకు లొంగి, ధనానికి దాసుణ్ణై కానిపనులుచేసి జీవితాన్ని కలుషితం చేసుకున్న పాపాత్ముణ్ణి, కనికరించండి !

పిచ్చి:- హద్దులుమీరిన బుద్ధులతో ప్రజాక్షేమాన్ని, ప్రభుత్వ ధర్మాన్ని విస్మరించినందుకు, శిక్ష అనుభవించటానికి సిద్ధంగా వుండు.

వెం:- [కత్తి అవతల పారేసి] నా సామిరంగా ! ఎరకొచ్చి

ఉరుకున బడ్డా నయ్యగోరూ. మీరే సెమించాలి మరి!

పిచ్చి:- నేనేగాదు, మిమ్మల్ని భగవంతుడుకూడా క్షమించడు మీ పండిన పాపానికి ఫలితంగా యిదుగో పత్రం! [జేబులోని అరెస్టు వారెంటు పత్రాన్ని తీసి చూపుతూ] మీ అహంకారాల్ని అంతుజేసే అరెస్టు వారెంటు!

1 వ పో:- సార్! గంగయ్య గారింట్లో 5 లక్షల రూపాయల ధనం పట్టుబడింది దానికి సంబంధించిన ఎకౌంట్సు అన్నీ దొరికాయి సార్।

2 వ పో:- సార్। ముత్తయ్య గారిట్లో యిండాక రైడ్ చేసినప్పుడు యీ దొంగ వీలునామా పత్రాలు దొరికాయండీ [పత్రాలు యిస్తాడు]

పిచ్చి:- మీ పాపపుచరిత్రంతా యీ నాటికి బయటపడింది. ఇంత కాలం నుండి యీ ధనానికి ఇన్‌కంటాక్సు లేకుండా గవర్నమెంటు వారిని మోసం చేస్తున్నావన్న మాట [పోలీసులతో] ఊఁ ... వెయ్యండి! నలుగురు చేతులకు బేడీలు!

పోలీ.- (బేడీలు వేస్తారు)

కాం:- [నవ్వుతూ ప్రవేశించి] బిందెలు రాకముందే చేతులకు అందెలు వచ్చాయే! ఓహో కాసుల పేరు చెడగొట్టి కంకణాలు చేయించుకున్నారా?

ము:- [కోపంతో] నిక్షేప ముందని నాటకమాడి, ఈ పోలీసులకి పట్టిస్తా?

కాం:- నేను పట్టించలేదు. మీ దురాశే, మిమ్మల్ని పట్టించింది. ఎన్నోసంవత్సరాలుగా గ్రామాన్ని రెండుచెక్కలు చేసి,పిచ్చి పిచ్చి చేస్తున్నారు. మీ యిద్దరి పొలాలకిమధ్యన

ఉన్న నా చేనును పదిసంవత్సరాలుగా పండకుండా పాడు బెట్టారు. నన్ను చేలోనుండి వెళ్లగొట్టాలని మెనో్నకుట్రలు కుయుక్తులూ పన్నారు. కుటుంబ బాధలతో కుళ్ళిపోతున్న నేను మనశ్శాంతికోసం పొలంమీద పడుకుంటే నేనేదో దుర్బుద్ధితో పడుకుంటున్నానని, నిక్షేపాలు వెదకు తున్నానని, నన్ను నాగుబాముల్లా వెంబడించారు. అదినాకెక్కడ దక్కిపోతుందోనని అనుక్షణం అనుమానాలతో ఆచూకీ తీస్తూ పొంచియుండటం ప్రారంభించారు. అప్పుడే పది మాసాలనాడు మీరు కుట్రపన్ని కొట్టి, నదిలో పారవేసిన నా తమ్ముడు ప్రాణంతో తిరిగివచ్చి నా పంచ చేరాడు. మీ ఆటకట్టించాలనుకున్నాం. గ్రామానికి మీ పీడ తొలగించాలనుకున్నాం; మా ఆలోచనల కనుగుణంగా మీకై మీరే దీపంమీద పురుగుల్లా వాలారు. మీ యిద్దరిలో ఉన్న కక్షన్నీ, కాంక్షల్నీ, పురస్కరించుకొని నిక్షేపమనే నెపంతో నన్ను బలవంతపెట్టి, ఈ పాటిదిబ్బను పాటమీద పైపాటబెట్టి కొన్నారు. ఆ దురాశతోనే [గంగయ్య వైపు తిరిగి] మీ అల్లుణ్ణి [పిచ్చివాడి వైపు చూపిస్తూ] నా తమ్ముణ్ణి, చివరికి, మీకు అన్నివిధాలుగా సహాయం చేసిన ఈ కరణాన్నికూడా చంపటానికి వెను కాడలేదు.

ము:- ఓరి! దుర్మార్గుడా! నిజంగా ఈ భూమిలో నిక్షేపం వున్నట్లు చూశావన్నావుగా!

కాం:- ఆ... చూశా? అర్ధరాత్రివేళ ఎకరం పొలానికి 40 వేలు వచ్చాయంటే యీ పొలం నిక్షేపంగాక యింకేమవుతుంది.

గం:- ఎంత దుర్మార్గం.

వెం:- ఆశ ! పూరుక్షోశ ! కాంతయ్యగోరూ ! మొగాడవంటే నువ్వు ! వంద గొడ్డుల్ని తిన్న రాబందు ఒక్క గాలి వానకు చచ్చిందిఅంట, నా సామిరంగా యీ నాటికి యీ ముత్తయ్యని. గంగయ్యని మట్టి గరిపించావ్.

పా:- నువ్వు నోరుమూసుకోని చావరా ! నాకు తెలియకడుగుతాను, యింకా నీ వాగుడు తగ్గలా.

ము:- మరి, లంకెల బిందెలు మోతలు వినిపించాయిగా !

పిచ్చి:- [నవ్వుతూ తన జోలెలోవున్న చెంబు బయటికి తీసి] యివిగో లంకె బిందెలు ! [అని చెంబులోని రూపాయలతో మోగిస్తాడు]

[అందరూ విభ్రాంత పోతారు]

కాం:- తమ్ముడూ. [పిచ్చివాడి దగ్గరకు వెళ్తాడు]

పిచ్చి.- అన్నయ్యా,

కాం:- ఇది నీ ఉద్యోగ ధర్మానికి ప్రథమ సోపానమైనా యీ దేశంలో వున్న ప్రతి గ్రామంలో, యిలాంటి వాళ్లు ఉన్నారు. వీరివల్ల అశాంతికి గురవుతున్నారు. నీతికి, నిజాయితీకి నిలబడి నీ ఉద్యోగ ధర్మాన్ని కాపాడుకుంటూ ప్రజలకీ, ప్రభుత్వానికీ సేవజెయ్, ఇదే నా ఆశయం.

పిచ్చి:- అలాగేనన్నయ్యా, నీ ఆశీర్వచన ఫలంచేత నీ ఆశయాన్నే సదా అనుసరిస్తాను. ఊ నడవండి, నడవండి తీసుకు పదండోయ్. [వెళ్ళబోతూ వుంటాడు]

కాం:- తమ్ముడూ, ఒక్కమాట. పేదల రక్తంతో కూడబెట్టిన యీ పిశాచపు ధనం నాకక్కర్లేదు. యిక్కడ ఎకరానికి 5 వేలు మాత్రమే ధరవుంది. ఆ అయిదు వేలు మాత్రమే

అట్టిపెట్టుకుంటాను. ఇవిగో మిగిలిన 35 వేలు తీసుకొని వెళ్ళి, ప్రభుత్వ పరంగా ఏ ప్రజాక్షేమ సంఘానికో వినియోగించు. (యిస్తాడు)

పిచ్చి:- అలాగే నన్నయ్యా, (వచ్చి తీసుకుంటాడు) వస్తా నన్నయ్యా శెలవు [వెళ్ళిపోతాడు]

చిరం:- [దూరాన్నుంచి] తాతయ్యా! తాతయ్యా!

కాం:- బాబూ. వస్తున్నా. [చిరంజీవి వస్తాడు]

చిరం:- రా, తాతయ్యా, అమ్మ వాళ్లు సామానంతా సర్దారు. నీకోసం ఎదురు చూస్తున్నారు.

కాం-: సరే, వెళ్దాం పద బాబూ! (వెళ్తారు.)

(తెర)

[సమాప్తం]



హక్కులు మాకు చెందియున్నవి. స్టేజి, స్క్రీన్, రేడియో వగైరాలకు వినియోగించ దలచినవారు శ్రీ కొడాలి వెంకటకృష్ణారావు, [ తెనాలి తాలూకా, పెదరావూరు. ] గారివల్ల పర్మిషన్ పొందవలయును.

ఇట్లు,

రవి బుక్ షాప్, తెనాలి.

---

శ్రీ ఆంధ్ర కేసరి లలిత కళాపరిషత్, విశాఖపట్నం వారు డి. 25-2-59 జరిపిన ద్వితీయవార్షిక పోటీలలో శ్రీ అభ్యుదయ నాట్యమండలి, మంగళగిరివారు ఈ నాటకాన్ని ప్రదర్శించి, యీ క్రింద తెల్పినవిధముగా బహుమతుల నందియున్నారు.

'లంకెలబిందెలు' నాటక ప్రదర్శనమునకు-ప్రధమ బహుమతి రోలింగ్‌షీల్డు, దాతలు- శ్రీ డి. ఎల్. నారాయణ, మద్రాసు

ఉత్తమనటనకు-శ్రీ ఏ. శివరామరెడ్డిగారికి (ముత్తయ్యపాత్ర) ప్రధమ బహుమతి - రజితపాత్ర - దాతలు - శ్రీ అమర్‌నాద్

ఉత్త[illegible]ధారణ, [illegible] ఆర్టిస్టు .. శ్రీ రామచంద్రరావుకు [illegible] షీల్డు దాతలు శ్రీ రేలంగి- మద్రాసు

[illegible]వరామరెడ్డికి - ప్రత్యేక బహు[illegible]గి వెంకట్రామయ్య-మద్రాసు

ఉత్తమ రచన[illegible] కొడాలి గోపాలరావు

